# ప్రాథమిక జ్ఞానము

## (హిందూ మతములో అదిపత్య క్రియ)

అచ్చు ఇం దూ మతము

హల్లు హిం దూ మతము

ఒకే భాష ఒకే పదము

ఎక్కడున్నది వేరే మతము




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు


www.thraithashakam.org





# ప్రాథమిక జ్ఞానము

## (హిందూ మతములో అదిపత్య క్రియ)


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (88) దశ అష్టాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38 ప్రథమ ముద్రణ : మార్చి–2017

ప్రతులు : 1000 **వెల : 65/-**





## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములోనే కులవివక్ష
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాలయదార్థసంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు

26) తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) మానవత్వము.
90) సుప్రసిద్ధి బోధ.
91) రూపము మారిన గీత.
92) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
93) యోహాను చెప్పిన జ్ఞానము
94) రాజకీయము×రాజకీయము.
95) ఉగ్రవాదము స్వర్గము కొరకే.
96) ఒక వ్యక్తిలో రెండు కోణములు.
97) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు
98) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.



01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నాం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము
48. దైవగ్రంథము
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?

79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ-పు / లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
115. శ్రీకృష్ణజన్మ మధుర.
116. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము
118. దేవుని ఆజ్ఞ-మరణము
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.



# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపీకృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా. T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్స్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)**
(ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# ప్రాథమిక జ్ఞానము

మొదటి దానిని "ప్రాథమిక" యని అంటారు. మొదట నేర్వవలసిన జ్ఞానము ప్రాథమిక జ్ఞానము. జ్ఞానములు రెండు రకములు. ఒకటి ప్రపంచ జ్ఞానము, రెండవది ఆత్మ జ్ఞానము లేక పరమాత్మ జ్ఞానము అంటాము. అర్థమయ్యేదానికి పరమాత్మ జ్ఞానమని చెప్పినా, శాస్త్రబద్ధము ప్రకారము ఆత్మజ్ఞానమనే చెప్పాలి. ప్రపంచ జ్ఞానములో రెండు రకములు గలవు. ఒకటి అక్షర జ్ఞానము, రెండు వ్యవహారిక జ్ఞానము. వ్యవహారిక జ్ఞానమునకు మొదటి గురు తల్లియని చెప్పవచ్చును. వ్యవహారిక జ్ఞానము చిన్నప్పుడు శిశుదశ నుండి మొదలగును. అక్షర జ్ఞానము పాఠశాలకు పోయినప్పుడు చదువుతో మొదలగును. అక్షర జ్ఞానమును మొదట తెలుపునది ప్రాథమిక పాఠశాలయని చెప్పవచ్చును. ప్రాథమిక పాఠశాల జ్ఞానము బాల్యదశ నుండి మొదలగును. ఇక ఆత్మజ్ఞాన విషయమునకు వస్తే కనీసము 12 సంవత్సరముల వయస్సు నుండి మొదలయ్యేది. పూర్వము 12 సంవత్సరముల నుండి గురుకుల పాఠశాలలో గురువు బోధించు జ్ఞానము ద్వారా ఆత్మజ్ఞానమును నేర్చెడివారు. ఈ విధముగా మనిషికి ప్రాథమిక జ్ఞానము ప్రారంభము కావలసియున్నది.

శిశుదశలో తల్లివద్ద వ్యవహారిక జ్ఞానము మనము చెప్పుకొన్నట్లే నేడు కూడా ప్రారంభమగుచున్నది. అలాగే అక్షర జ్ఞానము బాల్యదశలో ప్రారంభమగుచున్నది. అయితే ఒక్క ఆత్మజ్ఞాన విషయములో మనము చెప్పుకొన్నట్లు జరుగడము లేదు. యవ్వనదశలో ఆత్మజ్ఞానము ప్రారంభము కాకపోవడము వలన మనిషి ఆత్మ జ్ఞానములో (దైవ జ్ఞానములో) పూర్తి వెనుకబడి యున్నాడు. వెనుకబడియున్నాడు అనుటకంటే ఏమీ తెలియని స్థితిలో ఉన్నాడని చెప్పవచ్చును. పూర్వమువలె ఆత్మజ్ఞానమును బోధించు గురుకుల పాఠశాలలు నేడు వెదకినా కనిపించవు. అక్కడక్కడ గురుకుల

పాఠశాలలని పేరుగాంచినవి యున్నా అవి ఆత్మజ్ఞానమును బోధించునవి కాక ప్రపంచ జ్ఞానమును, ప్రపంచ చదువులను బోధించునవిగా యున్నవి. మొత్తము మీద ఆత్మజ్ఞానమును బోధించు వారే లేకుండా పోయారు. కొందరు గురువులను హోదాను చెప్పుకొనుచూ, తాము ప్రజలకు ఆత్మ జ్ఞానమును బోధించుచున్నామని కొన్ని ఆశ్రమాలను స్థాపించుకొని ఆత్మజ్ఞానమునకు తమ అడ్రస్సే సరియైనదని చెప్పుచుందురు. వారు బోధించిన దానికి ఆత్మజ్ఞానముకు ఏమాత్రము సంబంధము ఉండదు. భక్తి భావమును బోధించుచూ, దేవతా పూజలను వారు చేయుచూ ఇతరులతో కూడా చేయించుచుందురు. వారి లెక్కలో అదే నిజమైన దైవజ్ఞానముగా భావించియుందురు. వాస్తవముగా వారు ఆత్మజ్ఞానమును చెప్పరు. 'ఆత్మజ్ఞానము' అంటే ఏమిటో కూడా వారికి తెలియదు.

'ఆత్మ', 'ఆత్మజ్ఞానము' అను మాటలను ఊత పదములుగా, అలవాటు పదములుగా వాడుచుందురు. అంతేగానీ ఆత్మ అంటే ఏమిటో? వారికి ఏమాత్రము తెలియదు. నేడు చిన్న గురువులు, పెద్ద గురువులు ఎందరో ఎన్నో ఆశ్రమములు స్థాపించి శిష్యులను సంపాదించుకొని శిష్యులకు గురు ఉపదేశములను ఇచ్చి, వారికి శాశ్విత గురువులుగా మారిపోవుచున్నారు. కొందరు తమ గురూపదేశములకు ఏదో ఒక క్రొత్త పేరు పెట్టి అందరూ దానికొరకు తమవద్దకు వచ్చునట్లు ప్రచారము చేయుచున్నారు. అదేదో క్రొత్త పద్ధతని తెలిసిన వ్యక్తులు తాము ఇంతకుముందు ఇతరుల దగ్గర ఉపదేశము పొందియున్నప్పటికీ, తమకు గురువు యున్నప్పటికీ, తమ గురువుకు ఏమాత్రము తెలియకుండా క్రొత్త గురువు వద్దకు పోయి క్రొత్త ఉపదేశము పొందినవారు కూడా గలరు. గురువులు శిష్యుల మీద ఆధారపడి జీవనము సాగించుచూ, తమ వలననే తమ శిష్యులు జీవనము సాగించుచున్నారని చెప్పుకొంటున్నారు.

కొందరు గురువులు తమ ఉపదేశమును పొందాలంటే ఇంత మొత్తము డబ్బు ఇవ్వాలని చెప్పుచున్నారు. డబ్బు ఇచ్చిన వారికి మాత్రము ఉపదేశము ఇస్తున్నారు. ఈ విధముగా ఆత్మజ్ఞాన విషయములో అనేకులు అనేక విధములుగా ప్రవర్తించుచున్నారు. కొందరు ఆశ్రమములు స్థాపించి మానవ సేవే మాధవ సేవ యనుచూ దైవజ్ఞానము ఏమాత్రము లేకుండా మనుషుల సేవకే పరిమితి అయిపోయారు. కొందరు ఆశ్రమాలను తయారు చేసి 'యోగవిద్య నేర్పబడును' అని బోర్డు పెట్టి వ్యాయామము, ఆసనాలు వేయుచూ ఇది ఫలానా యోగాసనము, అది మరొక యోగాసనము అని చెప్పుచుందురు. పిరమిడ్ ద్యానము అని కొందరు, ద్యానము చేస్తే దేవుడు తెలియునని, దేవుడు ద్యాన ప్రియుడు, ద్యానము ద్వారానే మోక్షమును సాధించవచ్చునని కొందరు చెప్పుచుందురు. ఇట్లు అనేకులు అనేకముగా 'దేవుని జ్ఞానము' అను పేరుతో బోధనలు చేయుచూ, ఇదే నిజమైన ఆధ్యాత్మికము అని చెప్పుచున్నారు. అయితే వారి ఆధ్యాత్మికములో ఆత్మ ఉండదు, ఆత్మను ఆధ్యాయనము చేయడము ఉండదు.

ఆత్మంటే దయ్యము కదా!యను వారు కూడా ఆధ్యాత్మిక బోధలు చెప్పుచున్నామని అంటున్నారు. ఇటువంటి సమయములో అసలయిన ఆత్మజ్ఞానము మరుగున పడిపోగా, గురువులు మరియు బోధకులు నాకు తెలిసినదే గొప్పయని కొందరు, కాదని కొందరు చర్చలు సమావేశములు పెట్టుకొని మాటలతో పోట్లాడుచున్నారు. ఇన్ని రకముల జ్ఞాన మార్గములుండగా అందులో నిజమైన జ్ఞానము లేకపోగా, ప్రజలు గురువులను ఆశ్రయించి ఎక్కడా ఏమీ తెలియక నా గతి ఏమి? నేను దేవున్ని ఎలా తెలియాలి? అని బాధపడుచున్న సమయములో "మాదే నిజమైన జ్ఞానము, మా మతములోనికి వస్తే మీకు పాపక్షమాపణ కలదు,

అట్లు మీ మతములలో లేదు” అని క్రైస్థవులు తమ మతవ్యాప్తి కొరకు ప్రచారము చేయుచుండగా దైవజ్ఞానము మీద ఆసక్తి గల హిందువులు హిందూ మతమును వీడి క్రైస్థవ మతములోనికి చేరిపోవుటకు ప్రారంభించారు. హిందూ మతములోని చిన్న కులస్థులందరూ పెద్ద కులస్థుల చూపు కులవివక్ష చేత ఎక్కువ శాతము చిన్న కులస్థులు క్రైస్థవమతములో చేరిపోవడము జరిగినది. 10 (పది) శాతము పెద్ద కులస్థుల వివక్షకు హిందూమతమునకు సంఖ్యలో పట్టుకొమ్మలాగ యున్న చిన్న కులములలో దాదాపు 90 (తొంభైయి) శాతము మతమును మార్చుకొని ఇతర మతములలో చేరిపోయారు. ఈ విధముగా హిందూ మతములోని సంఖ్య చాలా శాతము తగ్గిపోయినది. అలా కుల వివక్ష చేత హిందూ మతమును వీడి క్రైస్థవ మతములోనికి పోయామని చాలామంది ప్రత్యక్షముగా చెప్పుచున్నారు.

పెద్ద కులస్థులు తమమీద పడిన అపవాదును కప్పిపుచ్చుకొనుటకు హిందూమతములోని వారు క్రైస్థవ మతములోనికి తమ వలననే పోయారను విషయమును ఎవరూ అనుకోకుండా దారి మళ్లించడానికి హిందూ మత రక్షణ సంస్థలను ఏర్పాటు చేశారు. అలా తయారయినవే నేడు హిందూ మతములో కనిపించుచున్న నాలుగు లేక ఐదు రకముల హిందూ మత రక్షణ సంస్థలు. అవి పెద్ద కులస్థులు నాయకులుగా యుండి తయారుచేసినవే. అటువంటి సంస్థలను గురించి బాగా ప్రచారము చేసి, మిగతా కులస్థులను అందులో సభ్యులుగా నియమించి, ఇతర మతస్థులు తమ మతమును ప్రచారము చేసి హిందువులను వారి మతములోనికి చేర్చుకుంటున్నారని బోధించి, తమకు సరిపోని వారిని ఇతర మతస్థులుగా చూపించి, తమ సభ్యులతో వారిమీద దాడిని చేయిస్తున్నారు. వారు నేరుగా క్రైస్థవ ప్రచారకుల

మీద దాడి చేయడము లేదు. తమని సమర్థించని వారి మీద, తమను తప్పులెంచు వారిమీద, వారు హిందువులయినా వారిని పరమతస్థులుగా లేక పరమతమును ప్రచారము చేయుచున్నారని ఆరోపణలు చూపుచూ హిందువుల చేత హిందువుల మీదనే దాడులు చేయిస్తున్నారు. సత్యమును వక్రీకరించక నేరుగా చెప్పు మా మీద హిందూ రక్షణవారు అలాంటి దాడులనే చేయించారు. హిందూమతములో మిగతా కులముల వారందరూ తమ నాయకులు చెప్పు మాటలను వింటున్నారు గానీ, నాయకులు తమతో తప్పు పనులు చేయిస్తున్నారని అనుకోవడము లేదు. ఇట్లు నేడు హిందూమతమును రక్షించుచున్నామని చెప్పువారు హిందూ మతమును క్షీణింపజేయుచున్నారు. హిందూ రక్షకులమని పైకి చెప్పుచూ, లోపల వారికి సరిపడని వారందరి మీద తమ మనుషులతో దాడులు చేయించుట అలవాటైపోయినది. ఇటువంటి పనుల వలన కాలము జరిగే కొలది హిందూమతము క్షీణించి పోవుచున్నది. ఒకప్పుడు హిందూ మత సంస్థల వారు హిందువులయిన మా మీదనే దాడులు చేయుట వలన ఇటువంటి మతములో ఉండకూడదు క్రైస్థవులుగానో, ముస్లీమ్‌లుగానో మారిపోవాలను ఆలోచన మాకు వచ్చినది. మేము ఎంతోమంది హిందువులకు జ్ఞానములో మార్గదర్శకులుగా యుండి, ఇప్పుడు ఎవరో ఏమో చేశారని మతము మారుట మంచిది కాదని హిందువులుగానే నిలబడిపోయాము.

ఈ విధముగా హిందూ మతములోని పెద్ద కులస్థుల వలన, వారి పెత్తనము వలన చాలామంది హిందూమతమును వీడి ఇతర మతస్థులుగా మారిపోయారు. అయినా హిందూ మతములోని వారు, అనగా మత రక్షణ ముసుగులో యుండి మతమునకు కీడు చేయువారు, హిందూ మత క్షీణతకు మనమే కారణము అనుకోవడము లేదు. హిందూమతములో

అదిపత్యమును కోరి దానికి తెలివిగా మతరక్షణ సంస్థలను స్థాపించి అందులో తమ మాట వినువారి చేత తమ పెత్తనమును చెలాయించుచూనే యున్నారు. ఇటువంటి వారికి హిందూ ధర్మములేవో ఏమాత్రము తెలియవు. అయినా మేమే నిజమైన హిందువులము అన్నట్లు, హిందూమతములో మేమే ముఖ్యమైనవారము అన్నట్లు కొందరు కలిసి ఒక సంఘమును, మరికొందరు కలిసి మరొక సంఘమును తయారు చేసి, వాటికి వేరువేరు పేర్లు తగిలించి అవన్నీ హిందూమతమును రక్షించుటకు పని చేయుచున్నవని చెప్పుచున్నారు. అయినా ప్రతి దినము హిందువులు క్రైస్థవులుగా మారుచూనే యున్నారు. అలా మారేటప్పుడు ఇన్ని మత రక్షణ సంస్థలు ఉండి ఏమి ప్రయోజనము? మతమును రక్షించు వారికి మత ధర్మములు తెలియవు అంటే వారి పని ఎలాగుండునో చూడండి.

హిందూ మతములో మతరక్షణ సంస్థలలో యుండినవారికి ఏమాత్రము హిందువులలోని ప్రాథమిక జ్ఞానము తెలియదు. ప్రాథమిక జ్ఞానముగానీ, హిందూ మతధర్మములు గానీ తెలియనివారు మత రక్షకులుగా ఉండడము ఆశ్చర్యము. మత ధర్మములుగానీ, మత గ్రంథముగా పేరుగాంచిన గ్రంథముగానీ తెలియనివారు మతమును రక్షించుదుము అనడము ఆయుధముల పేర్లు కూడా తెలియనివాడు నేను సేనాధిపతిని అన్నట్లున్నది. సేనాధిపతి అయ్యేవాడు ఆయుధముల పేర్లు తెలిసియుండాలి, ఆయుధములను వాడే విధానము తెలిసియుండాలి. తర్వాత యుద్ధ నైపుణ్యత పాఠము నేర్చినవాడై యుండాలి. అది ఏదీ లేనివాడు ఎట్లు సేనాధిపతి కాలేడో, అట్లే హిందూమతములో ప్రాథమిక జ్ఞానము తెలియనివాడు, హిందూ ధర్మములు తెలియనివాడు, హిందువుల దైవ గ్రంథమును తెలియనివాడు హిందూ మతరక్షకుడు కాలేడు. అయినా తమ లోపములను

కప్పిపుచ్చుకొనుటకు, తమ మీద ఎవరికీ అనుమానము రాకుండా యుండుటకు కొందరు హిందూరక్షణ సంఘములలో ఉన్నవారు పరమతములను విమర్శించు కరపత్రములను చిన్న ప్యాకెట్ పుస్తకములను ప్రచురించి ప్రజలకు పంచడము చూస్తే వారి పెత్తనమును కాపాడుకునే దానికి తప్ప హిందూమతమును కాపాడే దానికి కాదని తెలుస్తున్నది. వారు ప్రచురించిన మాటలలో వారి స్థోమత ఏమిటో తెలిసిపోవుచున్నది. వేమన యోగి పద్యమును మూడు పంక్తులు చెప్పి నాల్గవ పంక్తిలో 'వినుర వేమా' అనకుండా, 'గదరా సుమతీ' అని సుమతి శతకములోని పద్యము ముగింపును చెప్పినట్లు వారి వ్రాత కలదు. వారి వ్రాతను బట్టి వారిలో నున్న హిందుత్వమేమిటో తెలిసిపోవుచున్నది. అటువంటి వ్రాతను ఒకదానిని తీసి ఇక్కడ ప్రస్థావించబోతున్నాము.

ఎందరో మమ్ములను పరమత ప్రచారకులని అన్నారు. హిందువుల ముసుగులో ఇతర మతమును ప్రచారము చేయు పరమతస్థులని కొందరూ, హిందువులలోనే వీరిది ప్రత్యేక తెగ, వీరిని హిందువులుగా ఒప్పుకోకూడదని కొందరూ అన్నారు. అంతేకాక తమ చెప్పు చేతులలో యున్న మిగతా కులస్థుల చేత మా మీదికి వాదమునకు కూడా పంపారు. వారు మాత్రము ఎక్కడా బయటికి రారు. ఇదంతా హిందూ మతములో తమ అదిపత్యమును నిలుపుకొనుటకు కొందరు పెద్ద కులస్థుల పనియని నాకు అర్థమయినది. నేను పెద్ద కులస్థుడను కాదు కదా! నేను చౌదరి కులమున పుట్టినవాడ నైనందున ఇతరులెవరూ బోధకులుగా, గురువులుగా ఉండకూడదను వారి ఉద్దేశ్యమునకు మేము అడ్డముగా కనిపించి యుండవచ్చును. ఇంతకు ముందు దాదాపు రెండు వేల సంవత్సరముల నుండి హిందూ మతములో సిద్ధాంతకర్తలు వచ్చారు. మొదట వచ్చినవారు ఆది శంకరాచార్యుల వారు,

అద్వైత సిద్ధాంతమును ప్రచారము చేశాడు. రెండవ మారు వచ్చిన వారు విశిష్ఠాద్వైత సిద్ధాంతకర్త. ఆయన పేరు రామానుజాచార్యుల వారు. మొదట వచ్చిన ఆది శంకరాచార్యుడు బ్రాహ్మణుడు కాగా, ఆయన కేరళ నుండి వచ్చినవాడు. రెండవమారు వచ్చిన రామానుజాచార్యుల వారు తమిళ నాడు నుండి రాగా ఆయన కూడా బ్రాహ్మణుడే. అద్వైతమునకు, విశిష్ఠా ద్వైతమునకు వైరము దీర్ఘకాలముగా సాగినది. మూడవవాడుగా మధ్వాచార్యుల వారు వచ్చారు. ఆయన ద్వైత సిద్ధాంతమును ప్రకటించాడు. ఆయన కర్నాటక నుండి వచ్చిన బ్రాహ్మణుడు. ఈ విధముగా ముగ్గురు సిద్ధాంతకర్తలు ఒకే కులమునకు చెందినవారు. అందువలన బ్రాహ్మణ కులము వారందరూ వారిని గొప్పగా చెప్పుకొనుచుందురు. అద్వైతమనగా రెండు కానిది ఒకటని అర్థము. ద్వైత సిద్ధాంతమనగా రెండుగా యున్నది. ఇప్పుడు గత 38 సంవత్సరముల నుండి మేము **త్రైత సిద్ధాంతము**ను ప్రకటించాము. నేను ఆంధ్రనుండి వచ్చినవాడిని, కులము కమ్మకులము. కులమువద్దనే నేను కొందరికి వ్యతిరేఖముగా కనిపించుచున్నాను. అందువలన వారు నన్ను గురించి దుష్ప్రచారము చేయుచున్నారు. హిందూ మతము కులవివక్షతోనే కోలుకోలేనంతగా క్షీణించి పోయి ఉన్నది. ఇప్పుడు హిందువులయిన మమ్ములను హిందువులు కాదు అని ప్రక్కకు నెట్టివేస్తే సిద్ధాంతకర్తలు చివరకు హిందువులుగా మిగిలేది ఒక్క కులమువారే ఉందురు. ఇప్పటికే మా సిద్ధాంతములోని సత్యమును చూచి ఎందరో హిందువులు మావద్దకు వచ్చి జ్ఞానమును తెలిసి సంతోషపడుచున్నారు. ఒక్క హిందువులేకాక మిగతా మతములవారు కూడా త్రైత సిద్ధాంతములోని జ్ఞానమును తెలియ గలుగుచున్నారు. త్రైత సిద్ధాంతము వేగముగా ముందుకు పోవుచున్నది. త్రైత సిద్ధాంతమును గురించి వ్రాసిన గ్రంథములలో భూతములశక్తి, గ్రహముల శక్తి ఉండుట వలన ఆ గ్రంథములు మనిషి

శరీరమునకు అంటుకొని లాగినా వదలకుండా పట్టుకొని, మనిషిలోని కర్మను కాల్చివేయుచున్నవి. ప్రత్యక్షముగా బాధలను నిర్మూలించుచున్నవి. ఇదంతయూ తెలిసినా, కొందరు సంతోషపడుటకు బదులుగా అసూయపడి చెడుగా ప్రచారము చేయుచూ, వారికి చేతనయినది ఇతరులను సులభముగా నమ్మించునది అయిన మత ప్రచారమును తప్పుగా చెప్పడము చేయుచున్నారు. పరమతమును ప్రచారము చేయుచున్నామని చెప్పుచున్నారు. మొదటికి మేము హిందువులమే కాదు అని అంటున్నారు.

హిందూమత రక్షకులము అను పేరుపెట్టుకొన్నవారు మమ్ములను హిందువులు కాదు అంటే కొన్ని లక్షల మందిని హిందువులు కాదు అన్నట్లు అగుచున్నది. ఒక హిందువు క్రైస్థవునిగా మారితే హిందూమతము క్షీణించి పోవుచున్నది. హిందూమతమును రక్షించాలని సంఘములు స్థాపించుకొన్న వారే మమ్ములను హిందువులు కాదు అంటే కొన్ని వేలు, కొన్ని లక్షల మందిని హిందువుల నుండి విడదీసి వేరే మతస్థులని చెప్పితే హిందూ రక్షకులు, హిందూ మతమును రక్షించినట్లా లేక క్షీణింపచేసినట్లా మీరే చూడండి. ఇదంతా మేము కమ్మకులమున పుట్టిన దానివలన అలా చేయుచున్నారని అర్థమగుచున్నది. హిందూ మతము క్షీణించి పోవుచున్నది. మేము దానిని రక్షిస్తాముయని చెప్పువారే స్వయముగా మమ్ములను హిందువులు కాదు అంటున్నారంటే వారు నిజముగా హిందూమతమును నాశనము చేస్తున్నారు తప్ప, దానిని కాపాడడము లేదని తెలియుచున్నది. హిందూమతములో ఒక సిద్ధాంతకర్తగా యున్న మమ్ములను హిందువే కాదనడములో కులవివక్ష, అసూయ తప్ప వేరే ఏమీ కనిపించలేదు. ఇలా మాట్లాడడము వలన హిందూమతము క్షీణించడము తప్ప వేరే గత్యంతరమే లేదు.

అలా వారు మాట్లాడుటకు కారణము హిందూమతములోని ప్రాథమిక జ్ఞానము వారికి తెలియకపోవడము ఒక కారణమని కూడా చెప్పవచ్చును. కులవివక్ష 60 శాతముండగా, ప్రాథమిక జ్ఞానము లేకపోవడము 40 శాతము ఉండుట వలన హిందూ ధర్మ రక్షకులు కూడా హిందూ ధర్మ భక్షకులుగా మారిపోయారు. కులవివక్ష 60 శాతమున్నది. దానిని మేము ఏమీ చేయలేము. ప్రాథమిక జ్ఞాన విషయములో అయితే కొంతవరకు వారికి తెలిసినది అజ్ఞానమనీ, తెలియని ప్రాథమిక జ్ఞానమును చెప్పవచ్చును. ప్రాథమిక జ్ఞానమును తెలుపుట వలన కొంతవరకు వారిలో మార్పువచ్చి, కొంత జ్ఞానులుగా మారుటకు అవకాశము గలదు. హిందూ ధర్మములు తెలిసి జ్ఞానులుగా మారుట వలన అప్పుడు కులవివక్ష లేకుండా పోవచ్చును. అందువలన మాకు వ్యతిరేఖముగా మాట్లాడువారికి, వారికి తెలిసినది జ్ఞానము కాదని, వాస్తవానికి వారికి ప్రాథమిక జ్ఞానము కూడా తెలియదని దానిని వారికి చెప్పుటకు ప్రయత్నిస్తున్నాము. మేము చెప్పు జ్ఞానము ఒక మతమునకు మాత్రమే వర్తించునది కాకుండా, భగవద్గీతలోని జ్ఞానము మిగతా రెండు మతముల వారికీ వర్తించునని చెప్పుచున్నాము.

హిందూమతములోని హిందూ మత రక్షకులయినవారు ఇతర మతములను విమర్శించి వ్రాసిన మాటలను తీసుకొని వాటికి సక్రమమయిన మార్గములో సమాధానము చెప్పుదుము. దానివలన హిందూమతము క్షీణించకుండా అభివృద్ధి అగునని నమ్ముచున్నాము. పూర్వమువలె మూడు రకముల ప్రాథమిక జ్ఞానములలో మూడవదయిన జ్ఞానమును తెలుపు గురువు లేకపోవడము వలన హిందువులకు ప్రాథమిక జ్ఞానమే తెలియకుండా పోయినది. దానిని ఇప్పుడు తెలియుటకు పూనుకొందాము.

దీనివలన ఇతర మతముల మీద కూడా విశ్వాసము పెరుగును. నేను మూడు మతములకు గురువును. నాకు భగవద్గీత ఎట్లు అర్థమయినదో అట్లే మిగతా రెండు దైవ గ్రంథములు అర్థమయినవి. హిందూమతములో ఎక్కడయినా జ్ఞాన విషయములో తప్పు భావములుంటే దానిని చూపి, ఆ తప్పును సరిచేసి నిజమైన జ్ఞానమును తెల్పడము మా బాధ్యత. అలాగే క్రైస్థవములోనూ, ముస్లీమ్‌లలోనూ వారి గ్రంథముల నుండి తప్పుగా అర్థము చేసుకొనియుంటే దానిని కూడా సరిచేసి చెప్పుచుందుము. దేవుని విషయములో ఏ మతమువారు పొరపడినా ఆ పొరపాటును సరిచేసి నిజ భావమును తెలుపుచుందుము. మా దృష్ఠిలో అన్ని మతములకు దేవుడు ఒక్కడే, జ్ఞానము ఒక్కటే. మతమును దేవుడు పెట్టలేదు. మనిషి కల్పించు కొన్నదే మతము.

నా దృష్ఠిలో మత భావములు ఎక్కడా ఉండవు. దేవుడు అందరికీ ఒకే జ్ఞానమును చెప్పాడు. అందువలన మూడు దైవ గ్రంథములలో ఒకే జ్ఞానము కనిపించుచున్నది. నేను హిందువులలో ఉత్తమమైన జ్ఞానవంతున్ని. అట్లే మిగతా రెండు మతముల జ్ఞానములోనూ ఉత్తమమైన జ్ఞానము తెలుసు. అందువలన హిందూమతములో త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించాము. త్రైత సిద్ధాంతము అర్థమయితే వాడు ఎవడైనా సంపూర్ణ జ్ఞాని కాగలడు. నేను జ్ఞానముతో ఏ మతము వారితోనయినా మాట్లాడగలను. నేను చెప్పే జ్ఞానమే మూడు దైవ గ్రంథములలో ఒక్కటిగా కలదు. భగవద్గీతలోని వాక్యము బైబిలు, ఖుర్‌ఆన్ గ్రంథములలో కూడా కలదు.

హిందువులు నేడు మా మతమును మేము రక్షించుకొంటాము అంటున్నారు. వాస్తవముగా వారికి ప్రాథమిక జ్ఞానము తెలియకపోవడము వలన మతము అను పేరుపెట్టి హిందూ మతము అని అంటున్నారు.

ప్రాథమిక జ్ఞానము తెలియుట వలన హిందూమతము మతము కాదని పథమని తెలియగలదు. సృష్ట్యాది నుండి హిందూ సమాజము కలదు. ఇది మతముకాదు దీనికి ప్రవక్త ఎవరూ లేరు. రెండువేల సంవత్సరముల క్రిందటి వరకు హిందూ సమాజమునకు మతము అను పేరు లేదు. ఎప్పుడయితే క్రైస్థవము మతముగా చెప్పబడినదో అప్పుడు హిందువులు కూడా మాది హిందూమతము అని చెప్పుకొన్నారు. దీనినిబట్టి చూస్తే రెండువేల సంవత్సరములకంటే ముందు ప్రపంచములో మతము అను పేరే లేదు. హిందూ సమాజము కొన్ని లక్షల సంవత్సరముల నుండి యున్నా రెండువేల సంవత్సరముల వరకు మతము అను పేరు లేదు. జ్ఞానమార్గములో (పథములో) ముందుకు పోయేవారు. ఇప్పటి కాలములో హిందువులు, హిందూమత రక్షకులము అని చెప్పుకొను వారికి తెలియని సత్యమొకటి కలదు. అదేమనగా! హిందూ అను పేరు 150 సంవత్సరముల వరకు లేదు. 150 సంవత్సరముల పూర్వము 'ఇందూ' అను పేరు ఉండేది. అచ్చు "ఇ" తో చెప్పబడునది నేడు హల్లు "హి" గా మారిపోయినది. అదియూ ఈ మధ్య కేవలము 150 సంవత్సరముల క్రిందట మారిపోయిన దని నేటి హిందువులకు తెలియదు. 2000 సంవత్సరముల క్రితము ఇందూ మతము అను పేరుతో చెప్పబడుచున్నది. దానికంటే ముందు ఇందువులు అని మాత్రము చెప్పుకొనేవారు. ఇందువులు అనగా జ్ఞానులు అని అర్థము. పూర్వము కృతయుగములోనే ఇతర దేశములవారు వచ్చి ఇక్కడ దైవజ్ఞానులు ఎక్కువగా యున్నారని వారిని ఇందువులు అనడము జరిగినది. ఇందువు అనగా జ్ఞాని అని అర్థము. ఇందువులు (జ్ఞానులు) నివసించు దేశమును ఇతర దేశస్థులు ఇందూ దేశము అని చెప్పారు. అట్లే ఇందూ దేశముగా చెప్పబడిన పేరు 150 సంవత్సరముల క్రిందట ఇందువు పోయి హిందువుగా మారినది. వాస్తవముగా హిందూ అను

పదమునకు అర్థము లేదు. ఇందూ అను పదమునకు 'జ్ఞాని' అని అర్థము గలదు. మేము చెప్పు మాటకు ఆధారముగా రెండు న్యూస్‌పేపర్‌లను చూడవచ్చును.

*(అనంతపురం, సాక్షి న్యూస్‌పేపర్, 12-10-2015)*

# 'హిందూ పదానికి నిర్వచనం తెలియదు'

ఇండోర్: రాజ్యాంగం, న్యాయపరంగా హిందూ పదానికి నిర్వచనం తెలియదని కేంద్ర హోంశాఖ తేల్చింది. హిందూ పదం నిర్వచనం చెప్పాల్సిందిగా మధ్యప్రదేశ్‌కు చెందిన చంద్రశేఖర్ గౌర్ అనే వ్యక్తి సమాచార హక్కు చట్టానికి చేసుకున్న దరఖాస్తుకు బదులిస్తూ హోంశాఖ పై విధంగా స్పందించింది. ఆ పదానికి సంబంధించిన ఎలాంటి సమాచారంలేదని కేంద్ర పౌరసంబంధాల శాఖ అధికారి పేర్కొన్నట్లుగా కేంద్రం తెలిపింది. ఎలాంటి నిర్వచనం లేనప్పుడు ఫలానా వర్గంవారు హిందువులని ఎలా నిర్ధారిస్తున్నారని, దేశంలో హిందువులు మెజారిటీగా ఉన్నారని ఎలా చెబుతున్నారని గౌర్ ప్రశ్నించారు.

ప్రముఖుల లేఖ

( సాక్షి న్యూస్‌పేపర్, 21-01-2014)



## ఇందు దేశమే ఇండియా!

హిమాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి

ఈ విధముగా అర్థము లేని హిందువులుగా మనము పిలువబడు చున్నాము. ఇదంతా మతమునకు సంబంధించిన ప్రాథమిక జ్ఞానము. మొదట అది తెలియని దానివలన మత విషయములో అజ్ఞానము చేరినది. మిగతా ఏ విషయములో కూడా కనీస ప్రాథమిక జ్ఞానము లేనిదానివలన అన్ని విషయములలో అజ్ఞానమే కలదు. అయితే మేము జ్ఞానములోనే ఉన్నామని అందరూ అనుకొంటున్నారు. మీరు జ్ఞానములో లేరు అజ్ఞానములో ఉండి హిందూమతమును నాశనము చేస్తున్నారని, హిందూ మతమును ఉద్ధరించునది మీరు కాదు మేము అని తెలుపు నిమిత్తము, హిందువులలో యుండి మేము జ్ఞానులము అనుకొను వారి విషయమునే ఎక్కువగా వ్రాయదలచాము. నేటి హిందువులు ఇతర మతములను విమర్శించుచూ తమలోని అజ్ఞానమును బయట పెట్టుకొన్నారు. దానితో ఇతర మతముల వారు అజ్ఞానులని తెలియలేదుగానీ, వారిని విమర్శించు వీరే అజ్ఞానులుగా బయట పడినారని చెప్పుచున్నాము. ఇతరులను విమర్శించే శక్తి ఉందా లేదా!యని ఆలోచించి విమర్శనకు దిగియుంటే బాగుండేది. ఏ విషయములో కూడా ప్రాథమిక జ్ఞానము లేనివారు ఇతరులను విమర్శించడమెందుకు? తమలోని అజ్ఞానమును బయట పెట్టుకోవడమెందుకు?

'తిట్టే నోరు, తిరిగే కాళ్లు ఊరక ఉండవు' అన్నట్లు ఇతరులను విమర్శించు అలవాటున్న హిందువులు ఒక సిద్ధాంతకర్తను అయిన నన్ను కూడా విమర్శించారు. అనేకమార్లు విమర్శించడమేకాక మా భక్తులను బెదిరించడము, దాడులు చేయడము కూడా చేశారు. వారు అంతమాత్రము చేస్తే నేను కొంతమాత్రమయినా చేయాలి కదా! నేను ఏమీ చెడ్డచేయక వారి మంచికోరి వారి మాటలలోని అజ్ఞానము ఇదియని చూపించుచూ,

ఇది సరియైన జ్ఞానము అని తెలియజెప్పాము. అలా మంచి చెప్పడమే ఈ చిన్ని గ్రంథములో యున్నది. దానిని చూచిన వారందరూ వాస్తవ జ్ఞానము తెలియగలరని ఆశిద్దాము.

ఇక్కడ ఒక హిందూ సమాజములోని వ్యక్తి క్రైస్థవ సమాజములోని మనిషిని ఆధ్యాత్మిక ప్రశ్న అడగడము జరిగినది. అలా అడుగుటకు కారణము ఏమనగా! క్రైస్థవులు తమ మత గ్రంథమని చెప్పుకొంటున్న బైబిలు గ్రంథములో గల జ్ఞానమును తెలియకుండా, తమ గ్రంథములో సంపూర్ణ జ్ఞానమును తెలియకుండా, తమ మతమును వ్యాప్తి చేయాలను కోర్కెతో మత ప్రచారము చేయుచున్నారు. వారి మత ప్రచారము వలన హిందువులు ఉత్తరాంధ్రలో 80 శాతము మంది క్రైస్థవులుగా మారిపోయారు. దక్షిణ ఆంధ్రలో 30 శాతము మంది క్రైస్థవులుగా మారిపోయారు. దీనినిబట్టి చూస్తే 30 నుండి 80 శాతము వరకు హిందువులు క్రైస్థవులుగా మారిపోవడము జరిగినది. స్థానిక ప్రభావమును బట్టి ఒక్కొక్క చోట ఒక్కొక్క రకముగా మారిపోవుచున్నారు. దీనిని చూచిన హిందువులు తమ మతమును కాపాడుకోవాలని ఇతర కులముల వారికి చెప్పి అగ్రకులముల వారు హిందూమత రక్షణ సంస్థలను తయారు చేసి, హిందువులను అందులో సభ్యులుగా చేశారు. నాయకులుగా యున్న వారంతా అగ్రకులముల వారుండగా, పని చేయువారందరూ మిగతా కులముల వారుందురు. ఈ ఉద్దేశ్యము మంచిదేగానీ, ఉద్దేశ్యమునకు తగినట్లు పని చేయడము లేదు. క్రైస్థవ మత ప్రచారమును ఆపాలనుకొనుట మంచిదే. అయితే ఎక్కువ శాతము తమకు సరిపడని హిందువులు జ్ఞాన ప్రచారము చేసినా, దానిని కూడా పరమత ప్రచారము క్రిందికి జమకట్టి హిందువుల మీదనే దాడులు చేయుట హిందూ ప్రజలకు కూడా సరిపోవడము లేదు. బయటికి

కనిపించుటకు హిందూ మత రక్షకులమని పేరు పెట్టుకొనినా మత రక్షణ చేసినది ఏమీ లేదు. హిందువులు మత రక్షకులను చూచి హేవగించుకొని మతమును మార్చుకొన్నవారు కూడా కలరు. తాము హిందూ మత రక్షణ చేయుచున్నామని కనపడుటకు క్రైస్థవులను హేళనగా మాట్లాడినట్లు, వారికి వ్యతిరేఖముగా ప్రశ్నలు అడిగినట్లు చేయుచుందురు. ఇప్పుడు అడిగిన ప్రశ్నలు ఆ విధముగా ప్రచారము కొరకు అడిగినవే.

మేము హిందువులుగా యుండి హిందువులలో గురువులుగా యుండి, గురువులలో సిద్ధాంతకర్తగా యున్న మమ్ములనే హిందూ రక్షకులమని పేరు పెట్టుకొన్నవారు పరాయి మతస్థులను ఇబ్బందులు పెట్టినట్లు ఇబ్బందులు పెట్టారు. అటువంటి వారిని ఎదుర్కొనుచూ, వారికి వారి ప్రశ్నలలోని అజ్ఞానమును ఎత్తి చూపుచూ **'ప్రాథమిక జ్ఞానము'** అను గ్రంథమును వ్రాశాము. వారు ఇతర మతముల వారిని అడిగిన ప్రశ్నలు మేము వారికి చెప్పిన జవాబులు చూడండి. వారి ప్రశ్నలు పైకి ఎంత బాగా కనిపించినా వారికి హిందూమతములో ప్రాథమిక జ్ఞానము తెలియనందున ఏర్పడిన అజ్ఞానమును మేము చూపాము. మీరు వారి ప్రశ్నను, మా జవాబును చూచి అర్థము చేసుకోండి. ఒకమారు అర్థము కాకపోతే రెండవమారు శాస్త్రబద్ధముగా ఆలోచించండి. అప్పుడు సత్యము తెలుస్తుంది.

**ప్రాథమిక జ్ఞానము లేని హిందువుల ప్రశ్న :- దేవున్ని చూచినవాడే దేవున్ని గురించి చెప్పగలడు. మీలో ఏ ఒక్కరైనా మీ దేవున్ని చూచారా?**

**ప్రాథమిక జ్ఞానమున్న హిందువుల జవాబు :-** ఈ ప్రశ్నయందు మీలో ఏ ఒక్కరైనా మీ దేవున్ని చూచారా? అనుమాట చాలా అభ్యంతరకరముగా యున్నది. ఎందుకనగా! ప్రపంచములో ప్రజలకందరికీ, మతములన్నిటికీ

దేవుడు ఒక్కడే గలడు. ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క దేవుడు లేడు. అటువంటప్పుడు మీ దేవుడు వేరు, మా దేవుడు వేరు అన్నట్లు మీ దేవున్ని చూచారా? అని అడగడమే పెద్ద తప్పు. ప్రశ్నలోనే తప్పు యుండడము వలన ప్రశ్నించు వారికే దేవుని ఏకత్వమును గురించి తెలియదని అర్థమగు చున్నది. సర్వ ప్రపంచమునకు దేవుడు ఒక్కడేయనుట జ్ఞానమగును. వేరే మతమునకు వేరే దేవుడున్నాడనుట అజ్ఞానమగును. ఈ ప్రశ్నలో 'మీ దేవుడు' అనుమాట మాట్లాడిన వారు పూర్తి అజ్ఞానులని తెలియుచున్నది. అంతేకాక ఈ ప్రశ్నలో 'దేవున్ని చూచినవాడే దేవున్ని గురించి మాట్లాడగలడు' అని ఉన్నది. ఇందులో పూర్తి అజ్ఞానము మాట గలదు. అదేమనగా! 'దేవున్ని చూచినవాడు' అన్నది పూర్తి అజ్ఞానపు మాట. దేవుడు నామ, రూప, క్రియలు లేనివాడు. దేవునికి రూపము లేదు. అందువలన దేవుడు ఎవరికీ కనిపించువాడు కాడు. దేవుడు ఎవరితో మాట్లాడడు, ఎవరికీ కనిపించడు. అట్టి వానిని చూచారా? అని అడగడమే తప్పు. దేవున్ని చూచినవాడు దేవున్ని గురించి మాట్లాడగలడు అని అన్నారు. దేవున్ని గురించి మాట్లాడువారంతా దేవున్ని చూచారనుకోవడము పెద్ద పొరపాటు. నేడు మీరు దేవున్ని గురించి మాట్లాడుచున్నారు. అంతమాత్రమున మీరు దేవున్ని చూచారనుకోవడము మా తప్పగును. నేడు చాలామంది సద్గురువులు దేవున్ని గురించి బోధించుచున్నారు. అయినా వారు కూడా దేవున్ని చూచియుండలేదు. దైవగ్రంథములలో దేవున్ని గురించి దేవుడే చెప్పి యున్నాడు. అందువలన దైవ గ్రంథములోని దేవుని జ్ఞాన విషయములను చెప్పుచుందురు. అలా దైవ గ్రంథములోని మాటలను దేవుని మాటలుగా చెప్పవచ్చును. అంతమాత్రమున దేవున్ని చూచినవారే మాట్లాడుదురు అనుకోవడము పెద్ద పొరపాటు. వారిని ప్రశ్నించినవారు ఎవరయినా

దేవున్ని చూచారా? అని అడిగితే వారు కూడా ఎక్కడా చూడలేదు. అటువంటప్పుడు ఆ ప్రశ్న అడగడమే పెద్ద తప్పు. నిజమైన హిందువు (ఇందువు) దేవుని గురించిన జ్ఞానము తెలిసియుండును. అందువలన ఇందువు (జ్ఞాని) ఎవడూ ఆ ప్రశ్న అడగడు. ఇటువంటి ప్రశ్నలను అడిగి మిగతా మతముల ముందర నిజమైన ఇందుత్వమును పలుచన చేయవద్దండి. ముందు మీరు జ్ఞానులుగా మారండి.

**వారి ప్రశ్న :- మా మతములో రామక్రిష్ణ పరమహంస "దేవున్ని చూచాను, నీకు కూడా చూపుతాను" అని వివేకానందునికి చెప్పాడు. అలా మీ మతములో ఎవరయినా చెప్పారా?**

**మా జవాబు :-** ఏ మతములోనూ సాధారణ మనిషిగానీ, గొప్ప జ్ఞానులు గానీ, ఉన్నతమైన గురువులుగానీ ఎవరూ దేవున్ని చూడలేదు. తర్వాత కాలములో కూడా చూడబోరు. ఎందుకనగా! దేవుడు కనిపించువాడు కాదు. రామక్రిష్ణ పరమహంసను గురించి ఆయన చూచాడని, ఆ విషయము ఆయనే చెప్పాడని మీరు అంటున్నారు. వివేకానందుని విషయముగానీ, రామక్రిష్ణ పరమహంస విషయముగానీ ప్రజలకు చాలా నమ్మకము. వివేకానందుడు తనకు గురువు కావలెననీ, తన గురువు దేవున్ని చూచిన వాడు అయివుండవలెనని తలచి చాలామంది గురువుల వద్దకు పోయి మీరు దేవున్ని చూచారా? అని ప్రశ్నించగా వారు ఎవరూ చూచానని చెప్పలేదు. అలా కనపడిన గురువును అడుగుచూ వచ్చాడు. అలాగే రామక్రిష్ణ పరమహంస గురువుగా ఉన్నాడని తెలిసి, ఆయన వద్దకు వచ్చి అదే ప్రశ్నను అడిగాడు. అప్పుడు రామక్రిష్ణ పరమహంస గారు "నేను చూచాను, నీకు కూడా చూపుతాను" అని అన్నాడు. అప్పుడు వివేకానందుడు తృప్తిచెంది ఆయనవద్ద శిష్యునిగా చేరాడు. రామక్రిష్ణ పరమహంస చనిపోయే

వరకు వివేకానందుడు అక్కడేయున్నా, ఒక్కరోజు కూడా ఆయన చెప్పినట్లు దేవున్ని వివేకానందునికి చూపలేదు. దేవున్ని చూపకుండానే గురువుగారు చనిపోయారు. అప్పుడు వివేకానందుడు తమ గురువు తనతో చెప్పినది అసత్యమని ఆయనకు అర్థమయినది. రామక్రిష్ణ పరమహంస చనిపోయిన తర్వాత ఆయన 16 దినముల పూజలో వివేకానందుడు హాజరు కాలేదు. తోటి శిష్యులు పిలిచినా పోకుండా బయటనే ఉన్నాడు. కొన్ని సందర్భము లలో తమ గురువు మానసిక రోగియని, మతి చలించిన తిక్కవాడు అని అన్నాడు. ఆయన చరిత్ర తెలిసినవారికి రామక్రిష్ణగారు దేవున్ని చూడలేదు అని తెలియుచుండగా! మీరు గ్రుడ్డిగా ఆయన చూచాడు అనడము పొరపాటు కాదా!

**వారి ప్రశ్న :- మత ప్రచారము, మత మార్పిడి ఒకరకమైన రాజకీయమని మీకు తెలుసా?**

**మా జవాబు :-** 'కీయము' అనుమాట 'క్రియ' అను పదమునుండి పుట్టినది. క్రియ అనగా పని. అట్లే కీయము అనినా పనియని అర్థము. 'రాజ' అనగా 'పెద్ద'యని అర్థము. 'రాజకీయము' అనగా 'పెద్ద పని'యని అర్థము. మతమార్పిడి పెద్ద కార్యము అనుమాటను సూచించదు. మతమార్పిడి నీచమైన పని. అందువలన దానిని రాజకీయము అని అనకూడదు. అది సత్యముగా నీచకీయమేయగును. మతమార్పిడిని నీచకీయము అని అనవచ్చును. అంతేగానీ రాజకీయము అనడము పెద్ద పొరపాటు. మీ లెక్కలో మతమార్పిడి రాజకీయము అయివుండవచ్చును. మా లెక్కలో నీచకీయము అని చెప్పుచున్నాము. మీ ప్రశ్నకు జవాబుగా మతమార్పిడి నీచకీయమని మీకు తెలియదా! అని చెప్పుచున్నాము. ప్రశ్న అడగడము ముఖ్యము కాదు. ప్రశ్న సరియైనదో, కాదో ముందు చూచుకోండి.

**వారి ప్రశ్న :- హిందూ మతానికి ప్రామాణిక గ్రంథములు వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతయని మీకు తెలుసా?**

**మా జవాబు :-** ఇతర మతములను ప్రశ్నించునప్పుడు ఇటువంటి ప్రశ్నలు అడుగకూడదు. వారిని అడిగితే వారు జవాబు చెప్పలేని ప్రశ్నలు ఎన్నో గలవు. అట్లు అడుగకుండా మన ప్రశ్నకు మనమే జవాబు చెప్పలేని విధముగా అడిగితే అది మనకే అవమానకరముగా ఉండును. హిందూ మతానికి ప్రామాణిక గ్రంథము ఎప్పటికయినా ఒక్కటే ఉంటుంది. చాలామంది వేదాలు ప్రామాణిక గ్రంథములని అనుకొంటున్నారు. ద్వాపర యుగములో వ్యాసుని చేత గ్రంథరూపమైన వేదములను హిందువులు అందరూ ప్రామాణిక గ్రంథములు అని అనుకోవడము వలన, దేవుడు అధర్మములు చెలరేగిపోయాయని తలచి, వాటిని రూపుమాపుటకు ఆయన భగవంతునిగా అవతరించి భగవద్గీతను చెప్పి భగవద్గీతలోనే **"త్రైగుణ్య విషయా వేదా"** మూడు గుణముల విషయములే నాలుగు వేదములు అని చెప్పియున్నాడు. ఆ మాటనుబట్టి వేదములు మూడు గుణ రూపములని తెలియుచున్నది. ఒకచోట **"గుణమయీ మమ మాయా"** అని కలదు. దీనినిబట్టి గుణములే మాయగా ఉన్నాయని, మాయయని చెప్పబడుచున్నా యని తెలియుచున్నది. వేదములు గుణముల విషయములు కాగా, గుణములు మాయ కాగా! వేదములను కూడా మాయయని చెప్పవచ్చును. మాయగా యున్న వేదములు హిందూమతమునకు ప్రామాణిక గ్రంథములు అంటే మన ముఖమునకు మనమే మసి పూసుకొన్నట్లుండును. అందువలన హిందూ ధర్మములను తెలియజేసిన భగవద్గీతను హిందువుల ప్రామాణిక గ్రంథముగా చెప్పవచ్చును గానీ మిగతా గ్రంథములను చెప్పకూడదు.

ఏ మతానికయినా ప్రామాణిక గ్రంథము ఒక్కటేయుండును. వాస్తవముగా ఆ మతమునకు, ఆ గ్రంథమునకు ఏమీ సంబంధము ఉండదు. **“దేవుడు మూడు విధముల తన జ్ఞానమును తెలుపుదునని”** మొదటే చెప్పియున్నాడు. దేవుని జ్ఞానము సృష్ట్యాదిలో ఆకాశవాణి చేత చెప్పబడినది. ఆకాశవాణి చేత చెప్పబడిన జ్ఞానమే ముందు భగవద్గీతగా తయారయినది. తర్వాత రెండు గ్రంథములుగా కాలక్రమములో రూపుదిద్దుకున్నాయి. తర్వాత తయారయిన రెండు గ్రంథములలోనూ ముందు చెప్పిన భగవద్గీత జ్ఞానమే ఉన్నది. సారాంశ జ్ఞానమంతయూ భగవద్గీతది కాగా, మిగతా కొన్ని విషయములు అక్కడ భగవద్గీతలో చెప్పనివి ఐదు శాతము మిగతా రెండు గ్రంథములలో చెప్పబడియుండును. ముఖ్యమైన సారాంశ జ్ఞానమంతయూ రెండు గ్రంథములలో ఇమిడి యుండును. భగవద్గీతలో చెప్పినమాటే మిగతా రెండు గ్రంథములలో వ్రాయబడియున్నా భాష మార్పిడి వలన, పదముల మార్పిడి వలన భగవద్గీతలో చెప్పినమాట మరొక గ్రంథములో ప్రత్యక్షముగా యున్నా అది గుర్తించలేనిదై యుండును. ఉదాహరణకు భగవద్గీత మోక్ష సన్న్యాస యోగములో 17వ శ్లోకములో **“ఎవని భావములో అహంకారము లేదో వాడు ఇతరులను చంపినా వానికి పాపము అంటదు. వాడు హంతకుడు కాడు”** అని చెప్పబడి యున్నది. ‘అహంకారము లేకుండా’ అనగా నేను చేస్తున్నాను అని అనుకోకుండా ఏ పనిని చేసినా అది వాడు చేసినట్లుగా లెక్కించబడదు. ఇది ఆధ్యాత్మిక చట్టము ప్రకారము వాడు చేసినవాడు కాదు అని చెప్పబడినది. అయితే అదే వాక్యమే అనగా అదే భావముండు వాక్యమే ‘ఇంజీలు’ అను దైవ గ్రంథములో చెప్పినప్పుడు ఇంకొక విధముగా కనపించుచున్నది. ఇంజీలు గ్రంథములో **“ఒక మనిషి ఇంకొక స్త్రీని మోహపు**

**చూపుతో చూచినప్పుడు అతడు ఆ క్షణమే ఆమెతో వ్యభిచరించిన వాడగును. ఆ పని చేసిన పాపము అతనికి అంటుకొనును"** అని ఉన్నది. భగవద్గీతలో చెప్పినమాటకు, ఇంజీలులో చెప్పినమాటకు ఏమాత్రము పొంతన లేనట్లు కనిపించినా, రెండూ ఒకే అర్థము కలవిగా తెలియుచున్నది. అక్కడ అహంకారము లేనివాడు చేసినా చేయనట్లే అయినప్పుడు, అదే చట్టము ప్రకారము అహంకారమున్నవాడు చేయకున్నా అనుకోవడము వలన చేసినట్లే యగుచున్నది. ఈ రెండు వాక్యములు ఒకటే అయినా ఎవరూ గుర్తించ లేనంతగా యున్నవి. ఈ విధముగా భగవద్గీత వాక్యములే మిగతా రెండు గ్రంథములందు వేరు విధముగా చెప్పబడినవి.

హిందువులకు భగవద్గీత ప్రామాణిక గ్రంథము అగుట వలన అదియే మిగతా రెండు మతములకు కూడా ప్రామాణికమే యని చెప్పవచ్చును. మిగతా మతముల వారికి వారి గ్రంథములు ప్రామాణికముగా యున్నా, అందులో యున్నది భగవద్గీత జ్ఞానమే అగుట వలన, ఈ జ్ఞానమే అక్కడ వారికి వేరువేరు పేర్లతో ప్రామాణికముగా యున్నదని చెప్పవచ్చును. కొందరు భగవద్గీతకు వ్యతిరేఖ జ్ఞానము వారి మతములో యున్నదని చెప్పినా అట్లు ఎక్కడా లేదు. వారు దేవుడు పుట్టడు అని చెప్పినా, ఆ మాట వాస్తవము కాదు. వారి గ్రంథములో ఎక్కడా దేవుడు పుట్టడని లేదు. దేవుడు అవతరిస్తాడని వారి గ్రంథములోనే రెండు చోట్ల చెప్పబడియున్నది. దేవుడు పుట్టడని చెప్పినది వారి పెద్దలు చెప్పినమాటగానీ, గ్రంథములో యున్నమాట కాదు. ఈ విధముగా లెక్కించి చూస్తే వారి గ్రంథముల పేర్లు వేరయినా జ్ఞానము ఒక్కటేయగుట వలన, వారికి ప్రామాణిక గ్రంథములు ప్రత్యక్షముగా వారివే అయినా, పరోక్షముగా భగవద్గీతే యగును. భగవద్గీత జ్ఞానమే మిగతా రెండు గ్రంథములకు ఆధారముగా యున్నదని ఖుర్ఆన్ గ్రంథములో **సూరా ఐదులో ఆయత్‌లు 44, 46, 48, 68 లో**

చెప్పడమేకాక **(62-5)** లో భగవద్గీతను (తౌరాతును) చదువనివాడు, అనుసరించనివాడు మిగతా ఎన్ని గ్రంథములు చదివినా, అటువంటివాడు ఎన్నో గ్రంథములను వీపుమీద మోయు గాడిదలాంటివాడని ఉపమానము చెప్పారు. ఇంకా **(2-89), (10-37), (5-43)** లలో కూడా భగవద్గీతను గురించి చెప్పారు. అక్కడ వారు భగవద్గీతను తౌరాత్‌యని అన్నారు. **'తౌరాతు గ్రంథము అంటే భగవద్గీత'**యని చాలామందికి తెలియదు. తమ గ్రంథములకంటే ముందువచ్చినది తౌరాత్ గ్రంథము అని అంటున్నారు. మిగతా రెండు మతములలోనూ శాస్త్రబద్ధముగా భగవద్గీతలోని వాక్యములే వేరు విధముగా చెప్పియున్నారు. ఏ విధముగా చూచినా ఒక్క హిందూమతమునకే భగవద్గీత ప్రామాణిక గ్రంథమని చెప్పలేము. మిగతా రెండు మతములకు కూడా భగవద్గీత పరోక్షముగా ప్రామాణిక గ్రంథముగా యున్నదనీ, ఇది అందరికీ తెలియని సత్యమనీ చెప్పవచ్చును. తౌరాత్ గ్రంథము అంటే భగవద్గీతయని క్రైస్థవులకు, ముస్లీమ్‌లకు తెలియదు. అట్లే భగవద్గీత పేరే తౌరాతుయని, అది స్వయముగా శ్రీకృష్ణభగవాన్ పెట్టిన పేరని హిందువులకు కూడా తెలియదు.

**వారి ప్రశ్న :- 'ఏసు పాపులను రక్షించును' అని చెప్పారు. కృష్ణుడు భగవద్గీతలో "పరిత్రాణాయ సాధూనాం" అని అన్నాడు. ఏది మంచిదో మీరే చూడండి. సన్మార్గులను, సాధువులను మన దేవుడు రక్షించితే దుర్మార్గులను, పాపులను వారి దేవుడు రక్షించును. ఇది చెడును ప్రోత్సహించినట్లు కాదా! మన దేవునికి వారి దేవునికి ఎంత తేడా యున్నదో చూచారా?**

**మా జవాబు :-** ప్రాథమిక జ్ఞానము తెలిస్తే రెండు మాటలలో ఏమాత్రము తేడా లేదు. ఇదంతా ఉన్నత జ్ఞాన విషయము కూడా కాదు, కేవలము

ప్రాథమిక జ్ఞాన విషయమే. ఒకాయన పాపులను రక్షిస్తాడు, ఇంకొకాయన సాధువులను సంరక్షిస్తాడు. ఒకరు దుర్మార్గులను రక్షించి చెడు పనిని చేయుచున్నాడు. మరొకరు సన్మార్గులను రక్షించి మంచి పనిని చేస్తున్నాడు కదా!యని అంటున్నారు. పైకి అలాగే కనిపించినా కొద్దిగా బుద్ధిపెట్టి ఆలోచించిన ఇందులోని సత్యము అర్థమయిపోవును. భగవద్గీత జ్ఞానయోగములో 36, 37 శ్లోకములను చూచిన **"పాపాత్ములలో నీవు ఎంత పెద్ద పాపాత్ముడవైనా గానీ నిన్ను నా జ్ఞానము చేత పవిత్రున్ని చేతును"** అని స్వయముగా కృష్ణుడు చెప్పాడు. 'అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః' అనే శ్లోకములో ఈ విషయము గలదు. ప్రక్కనే 37వ శ్లోకములో **"అగ్నిలో కట్టెలు కాలిపోయినట్లు జ్ఞానమను అగ్నిలో పాపములనునవి పూర్తిగా కాలిపోవును"** అని చెప్పాడు. ఇక్కడ ఏసు చెప్పినదే కృష్ణుడు కూడా చెప్పాడు.

పాపులను రక్షించితే సాధుజనులవుతారు. అప్పుడు అధర్మములను అణచివేసి అందరినీ ధర్మవరులుగా మార్చినట్లేయగును. పాపులలోని పాపములను క్షమించితే, లేకుండా చేస్తే వారు సాధుజనులే అవుతారు. అలాగే సాధుజనులను పెంపొందించాలంటే, సాధుజనులను ఎక్కువ చేయాలంటే పాపజనులను లేకుండా చేయాలి. లేకుండా చేయాలంటే వారి కర్మలను (పాపములను) లేకుండా కాల్చివేయాలి. అదే క్షమాశీలత. పాపులను మనుషులలో ఉండే పాపములను లేకుండా చేయదునని మూడు దైవ గ్రంథములలో ఇదే విషయమునే చెప్పుచూ భగవద్గీతలో **'కర్మదహనము'** అని అన్నారు. బైబిలులో **'పాపక్షమాపణ'** అన్నారు. ఖుర్ఆన్‌లో **'పాప క్షమాశీలత'** యని అన్నారు. మూడు ఒకే జ్ఞానమునే తెల్పుచున్నవి కదా! పాపులను క్షమిస్తానంటే వారి కర్మను లేకుండా చేసి మంచివారిగా మార్చడమే కదా! అలాగే మంచివారిని పెంపొందిస్తానంటే పాపాత్ముల పాపములను లేకుండా చేస్తాననేగా అర్థము. రెండు మాటలు ఒక్కటేగా!

'వినాశాయచ దుష్కృతామ్' అను మాటలో పాపులను చంపుతాను అని చెప్పుకోకూడదు. పాపులను లేకుండా చేస్తానని అర్థము గలదు. పాపులను లేకుండా చేస్తే **'పరిత్రాణాయ సాధూనామ్'** అగును. మంచివారి సంఖ్యను పెంచినట్లగును. చెడువారి సంఖ్యను లేకుండా చేసి మంచి వారి సంఖ్యను పెంచుతాను అని శ్లోకములో అర్థము కలదు. "ఎంత దుర్మార్గుడయినా గానీ వాని పాపమును లేకుండా చేతును" అని జ్ఞానయోగములో 36వ శ్లోకమందు చెప్పినప్పుడున్న అర్థమే 'మీ పాపమును క్షమింతును' అని చెప్పినట్లే కదా! పాపమును క్షమించినంత మాత్రమున పాపులను లేకుండా చేసినట్లగును గానీ వేరుగా చెప్పుకొనుటకు అవకాశము లేదు. దేవుడు ఏ మతమునందయినా తనను ఆశ్రయించిన వారికి పాప క్షమాపణ చేయునని అన్ని గ్రంథములలో చెప్పియున్నారు. అయితే కొందరు దానిని అర్థము చేసుకోలేక పాపక్షమాపణను పాపరక్షణ అని అనుకొన్నారు. పాపాత్ములను నేను పవిత్రులను చేయుదును అని భగవద్గీతలో కలదు. అలా చెప్పడములో పాపములను లేకుండా చేసి వారిని పవిత్రులను చేతునని అర్థము. అదే విధానము మూడు దైవ గ్రంథములలో గలదు. ఒకదానిలో ఏమి ఉండునో మిగతా రెండు గ్రంథములలో కూడా అదే ఉండును. చిన్న ఉదాహరణను చెప్పితే ఇలా కలదు. పాము ముందుకు పోతుంది అని చెప్పినా, పాము వెనకకు ప్రాకదు అని చెప్పినా రెండూ ఒకే అర్థము. అయితే చెప్పడము వేరుగా యున్నది. అలాగే పాపులను లేకుండా చేసితే పవిత్రులవుతారు. పవిత్రులను పెంచాలంటే పాపాత్ములను లేకుండా చేయాలి. రెండూ ఒక్కటేయగును. అదే విధముగా బైబిలులో పాపాత్ములను క్షమించుతాను అన్నాడు. అదేమాటనే గీత జ్ఞానయోగము 36లో ఎంత పాపాత్ముడైనా మీ పాపము లేకుండా చేస్తానని అన్నాడు. **మూడు**

**మతములకు దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటే.** గ్రంథములో చెప్పిన దానిని అర్థము చేసుకోలేక నీ ఇష్టము వచ్చినట్లు అనుకొంటే దానిని దేవుడు ఒప్పుకోడు. అలా వక్రీకరించి చెప్పినవారికి శేషము గల పెద్ద పాపము చేరును.

నేటి క్రైస్థవులు తమ మత ప్రచారము మీద దృష్టి పెట్టి మిగతా మతములకంటే తమ మతమే గొప్పదని ప్రచారము చేయుచున్నారు. మత విషయములో క్రైస్థవులు తప్పుగా ప్రవర్తించడము, తమ మతములోనికి హిందువులను ఆకర్షించుకొనేదానికి ఏసు చెప్పనివి, బైబిలులో లేని విషయములు ప్రచారము చేయుచున్నారు. ఏసు చెప్పిన మాటలు బైబిలు గ్రంథములో ప్రత్యక్షముగా యున్నాయి. అక్కడ పాపముల విషయములో ఏమి చెప్పాడు అని చూస్తే నేడు క్రైస్థవుల ప్రచారము పూర్తి తప్పగును. బైబిలులోని విషయములు క్రైస్థవులకు ఏమాత్రము అర్థము కాలేదని తెలియుచున్నది. ఇంతవరకు భగవద్గీతలో చెప్పిన విషయములు చెప్పాము. ఇప్పుడు బైబిలులో పాప విషయముల గురించి చెప్పితే, ఒకరోజు విందులో ఏసు ద్రాక్షరసము ఇచ్చి "ఇది నా రక్తము" అన్నాడు. అలాగే రొట్టె ముక్క ఇచ్చి "ఇది నా శరీరము" అన్నాడు. **"నా నిబంధన రక్తము చేత మీ పాపములు పోతాయి"** అని అన్నాడు. అంతకుముందు ద్రాక్ష రసము ఇచ్చి "ఇది నా రక్తము, దీనిని త్రాగుము" అని చెప్పాడు. తర్వాత "తన నిబంధన రక్తము చేత పాప క్షమాపణ కలదు" అని అన్నాడు. రక్తమును త్రాగమన్నాడుగానీ దానిని పూసుకొంటేనో, రక్తముతో కడుగుకుంటేనో పాపము పోతుందని చెప్పలేదు.

నేడు క్రైస్థవులు మా ఏసు రక్తము వలన మీ పాపము కడిగివేయ బడుచున్నది. మా దేవుడు పాపమును క్షమించును. మీ దేవుడు పాపులను

యమలోకమునకు పంపి శిక్షలు అనుభవించేటట్లు చేయును. నేడు పాపము చేయనివాడు ఎవడూ లేడు. కావున మీరందరూ ఏసువద్దకు వచ్చి, ఏసును విశ్వసిస్తే మీ పాప క్షమాపణ జరిగిపోవును. మీ మతములో పాపులు శిక్షించబడుదురు. మా మతములో పాపులు క్షమించబడుదురు. మీ పాపములు ఏసురక్తము చేత కడిగివేయబడును. రక్తప్రోక్షణ వలననే మీ పాపము పోవును అని చెప్పుచున్నారు. అలా చెప్పడము పూర్తి తప్పు. ఏసు తన రక్తమును త్రాగమన్నాడుగానీ వేరే ఏమీ చెప్పలేదు. రక్తమును నిబంధన రక్తము అన్నాడు గానీ, సాధారణ రక్తమని చెప్పలేదు. అయితే అక్కడ ఇచ్చినది ద్రాక్షరసము. ద్రాక్షరసమును రక్తముగా ఎలా పోల్చుకోవాలి? దానిని త్రాగితే ఏమవుతుందో ఆయనే చెప్పాడు. పాపములు పోతాయని చెప్పాడు. పాపములు లేకుండా పోవుటకు ద్రాక్షరసములో ఏ శక్తి కలదు? ఇచ్చినది అప్పటి శిష్యులకే గానీ అది నేడు ఇతరులకు ఎట్లు వర్తించును? ఈ రోజు ద్రాక్ష రసముగానీ, రక్తముగానీ ఏదీ లేదు. ఆయనే లేడు, ఇప్పుడు ఆయన రక్తము ఎలా దొరుకును? ఆయనే లేనప్పుడు ఆయన రక్తమును గురించి క్రైస్థవులు చెప్పడము మోసము చేసినట్లు కాదా! ప్రజలను తప్పుదారిలో పంపించినట్లు కాదా?

క్రైస్థవులు నేడు మత ప్రచారము చేయుచున్నారు తప్ప, జ్ఞాన ప్రచారము చేయలేదు. హిందువులు వారిని చూచి, వారిని ప్రశ్నించే రకముగా ప్రశ్నించిక హిందువులు కూడా తప్పుగా ప్రశ్నించుచున్నారు. వీరి ప్రశ్నలు వీరి తప్పును చూపుచున్నవి తప్ప వారి తప్పును చూపలేదు. ఇప్పుడు మేము అడిగినట్లు వారి తప్పును చూపి అడుగవచ్చును కదా! ఇరువైపులా తప్పులేయున్నవి. హిందువులకు తమ ప్రామాణిక గ్రంథమయిన భగవద్గీత ఇంతవరకు అర్థము కాలేదు. అలాగే క్రైస్థవులకు బైబిలు గ్రంథము

అర్థము కాలేదు. వారు వారి ప్రచారములో "రక్తప్రోక్షణ పాపపరిహారమ్" అను వాక్యమును చెప్పుచుందురు. ఆ వాక్యము వేదములలో కలదని, రక్తము చేత కడుగుట చేత పాపక్షమాపణ కలదని చెప్పుచుందురు. అయితే వారికిగానీ, వారి పెద్దలకుగానీ రక్తము అంటే ఏమిటో తెలియదు. ఏసు రక్తము ఆయనను ములుకులు కొట్టిన రోజే కారిపోయింది. అట్లు కారినప్పుడయినా ఎవడయినా ఆయన రక్తమును తీసుకొని తమ పాపములను కడుగుకొన్నారా? ఏదీ లేనిది వారు తమ మత ప్రచార నిమిత్తము రక్తము పాపక్షమాపణ అని అసత్యమును చెప్పుచున్నారు. ఎవరయినా, ఏ మతస్థుడయినా తమ గ్రంథములోని విషయములను తప్పుగా చెప్పితే, అప్పుడు వారి తప్పులను చూపి వారిని విమర్శించవచ్చునుగానీ, అట్లు కాకుండా మనము తప్పుగా మాట్లాడుచూ వారిని ప్రశ్నించడము మంచిది కాదు. వారిలోని తప్పులు తెలియుటకు ముందు హిందువులు వారి గ్రంథమును చదివి మనము అర్థము చేసుకొనియుంటే వారిని ఎప్పుడయినా తప్పు పట్టవచ్చును. బైబిలులో ఉండేది కూడా భగవద్గీతలోనిదే. నేను మూడు గ్రంథములను చదివాను, నాకు బాగా అర్థమయినాయి. అందువలన నేడు నేను ఎవరి గ్రంథములోని సమాచారమునయినా చెప్పగలను. మిగతా రెండు మతముల తప్పులను చూపగలను.

**వారి ప్రశ్న :- క్రైస్థవ దేవుడే నిజమైన దేవుడని, హిందూ దేవుళ్లెవరూ దేవుళ్లే కాదని అంటే ఇంతవరకు ముందు దేవుడు లేడా? అంతకుముందు మతాలు లేవా? భగవంతున్ని చేరుకొన్న మహాత్ములు లేరా?**

**మా జవాబు :-** ఈ ప్రశ్నలో మూడు తప్పులు కనిపిస్తున్నాయి. జవాబు చెప్పవలసిన వానిది ఎటూ తప్పేయుండును. అయితే ముందు మనవైపు నుండి భగవద్గీత ప్రకారము, శాస్త్రబద్దత జ్ఞానమును అనుసరించి తప్పులు

ఉండకూడదు. మా తప్పులేమున్నాయని మీరు అనుకోవచ్చును. వాళ్ళ దేవున్ని ఒక్కనినే చెప్పి, హిందూ దేవుళ్లను అనేకులున్నట్లు అడగడము మొదటి తప్పు. అంతకు ముందు మతాలు లేవా? అనడము రెండవ తప్పు. భగవంతున్ని చేరుకున్న మహాత్ములు లేరా? అని అడగడము మూడవ తప్పు యగును. అంతకుముందు మతాలు లేవాయని అన్నారు కదా! అంతకుముందు మతాలు ఏమాత్రము లేవు. క్రైస్థవము వచ్చిన తర్వాత మొదట సంఘములు ఏర్పడి, తర్వాత సంఘములు మతముగా మారినవి. క్రైస్థవము మొదట మతముగా మారిన తర్వాత హిందూ సమాజము కూడా తమది హిందూ మతమని చెప్పుకొన్నది. మతాల చరిత్రలోనికి పోతే హిందుత్వము మొదటి నుండి యున్నా దానికి మతము అను పేరు లేదు. రెండువేల సంవత్సరముల పూర్వము ఏర్పడిన క్రైస్థవము మొదటి మతముగా తయారు కాగా, కొన్ని లక్షల సంవత్సరముల నుండి యున్న హిందూ సమాజము తమను కూడా మతముగా చెప్పుకోవడము మొదలయినది. అట్లు హిందుత్వము రెండవ మతముగా తయారయినది. అంతకుముందు మత ప్రసక్తే లేదు. రెండు వేల సంవత్సరముల నుండి క్రైస్థవముతో పాటు హిందుత్వము మతమయినది. అప్పుడు 'హిందూ' అనే పేరుతో లేకుండా **'ఇందు'** అను పేరుతో యుండేది. దాదాపు 150 సంవత్సరముల క్రిందటి వరకు 'ఇందూ మతము' అని చెప్పబడినది. నేడు 'హిందూ మతము' అను పేరుతో చెప్పబడుచున్నది. ఈ విధముగా చరిత్ర తెలిసి మాట్లాడితే అప్పుడు మతములు లేవు. తెలియక మాట్లాడితే పై ప్రశ్నలాగా అంతకుముందు మతాలు లేవా? అని అడిగినట్లుంటుంది. అలా అడగడము మాకు చరిత్ర తెలియదని చెప్పుకొన్నట్లున్నది. అలా మనంతకు మనము తెలివి తక్కువవారుగా బయటపడడము మంచిదా?

క్రైస్థవులు 'తమ దేవుడు నిజమైన దేవుడు' అని అనడము సహజమే. అంతమాత్రమున 'హిందూ దేవుళ్లు ఎవరూ దేవుళ్లు కాదని' అంటారా అని మనము అడిగినట్లు కలదు. వారు ఒక్క దేవున్ని ప్రస్తావిస్తే, మనము అనేకమంది దేవుళ్లను ప్రస్తావించడము మన తెలివి తక్కువ పనే యగును. ఎవరికయినా దేవుడు ఒక్కడే ఉంటాడు, ఎక్కువమంది దేవుళ్లు ఉండరు. అలా ఎక్కువ మందిని చెప్పకూడదు. వారి మతానికి ఒక పేరు దేవుడుంటే, మన మతానికి కూడా ఒక పేరుగల దేవుడు ఉండును. వాస్తవముగా పేర్లు వేరయినా ఇద్దరికీ ఒకే దేవుడున్నాడనుమాట వాస్తవము. ఒకే దేవున్ని మరచి చాలామంది దేవుళ్లు అనడము, దేవుని మార్గములో పూర్తి తప్పుయగును. అలా ఎక్కువ దేవుళ్లను చెప్పి మన అజ్ఞానమును మనమే బయట పెట్టుకోకూడదు. వాక్యములో ఇది రెండవ తప్పుగా యున్నది.

భగవంతున్ని చేరుకొన్న మహాత్ములు లేరా? అని అడగడము మూడవ తప్పుగా యున్నది. ఇందులో ఏమి తప్పు లేనట్లు కనిపించినా దేవుని స్థానములో భగవంతుడు అని చెప్పడము ఆధ్యాత్మికము తెలిసిన వారికి పెద్ద తప్పుగా కనిపించును. అలా కనిపించుటకు కారణము ఏమనగా! దేవుడు వేరు, భగవంతుడు వేరు అయి ఉండడమే కారణము అని చెప్పవచ్చును. దేవున్ని చేరుకున్నవారు లేరా? అని అడిగియుంటే సరిపోయేది. అలా కాకుండా భగవంతున్ని చేరుకొన్న వారు లేరా? అనడము పూర్తి తప్పు అయినది. ఆధ్యాత్మికములో దేవుడు వేరు, భగవంతుడు వేరు. దేవుడు కనిపించనివాడు, ఎవరికీ తెలియనివాడు. భగవంతుడు అందరికీ కనిపించేవాడు, అందరికీ తెలిసేవాడు. దేవుడు భూమిమీద అవతరించాలనుకొన్నప్పుడు శరీరము ధరించి భగవంతుడై పుట్టును. శరీరము ధరించి పుట్టిన వానిని 'భగవంతుడు' అని అందురు. భగవంతుడు

అందరికీ కనిపిస్తున్నా, ఆయనే భగవంతుడని ఎవరికీ తెలియదు. అటువంటప్పుడు ఎవరయినా భగవంతున్ని ఎలా చేరగలరు? సాధారణ మనిషిలాగా ఆయనవద్దకు ఎవరయినా పోవచ్చునుగానీ, ఆయనే భగవంతుడని తెలిసి ఆయనను ఎవరూ ఆశ్రయించలేరు. భగవంతుడు భూమిమీద యున్నా, ఆయనను ఎవరూ గుర్తించలేరు. ఆయన సర్వసాధారణ మనిషిలాగే యుండును. ఆయనే భగవంతుడని చెప్పుటకు ఆయనకు ఏ గుర్తులు ఉండవు. భగవంతుడు అనుటకు నిర్వచనము ఒకటి గలదు. అదేమనగా! 'భగము నుండి సజీవముగా పుట్టినవానిని భగవంతుడు' అని అనవచ్చును. భగము అనగా తల్లిగర్భము. తల్లిగర్భము నుండి సజీవముగా పుట్టిన వానిని భగవంతుడుయని అందురు. తల్లి గర్భమునుండి మనము అందరము పుట్టాము కదా!యని కొందరు అడుగ వచ్చును. వాస్తవానికి భూమిమీద తల్లిగర్భము నుండి సజీవముగా ఎవరూ పుట్టలేదు. ఈ విషయమును మా రచనలలో **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథము చదివితే తెలుస్తుంది.

ఎవరయినా దేవున్ని చేరి, ఆయనయందు ఐక్యమై పోవచ్చునుగానీ భగవంతుని చేరి ఆయనలో కలిసిపోయిన వారు ఎవరూలేరు. కర్మలు లేకుండా పోయినవాడు దేవునిలో చేరిపోవచ్చుననుట శాస్త్రబద్ధమైన మాట యగును. భగవంతునిలో చేరిపోయాడనుట అశాస్త్రీయమగును. శాస్త్రములు భూమిమీద ఆరు గలవు. అందులో వరుసగా 1) గణిత శాస్త్రము 2) ఖగోళ శాస్త్రము 3) రసాయన శాస్త్రము 4) భౌతిక శాస్త్రము 5) జ్యోతిష్య శాస్త్రము 6) బ్రహ్మవిద్యా శాస్త్రము. చివరిది బ్రహ్మవిద్యా శాస్త్రము అన్నిటికీ ఆధారమైన శాస్త్రము. ఆధ్యాత్మికములో తప్పు ఒప్పులను దీని ద్వారానే తెలియవచ్చును. అందువలన బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము

దేవుడు వేరు, భగవంతుడు వేరని చెప్పవచ్చును. అట్లుకాకుండా దేవుడు భగవంతుడు ఒక్కడేయని అనుకొంటే అది ధర్మ విరుద్ధము, శాస్త్రవిరుద్ధము అగును. ఎదుటివాడు ఆధ్యాత్మిక విద్యను నేర్చియుంటే అప్పుడు హిందూ ధర్మరక్షణ వారికి హిందూ ధర్మములే తెలియవను మాట బయటపడును. నేడు ఉన్న సత్యము కూడా అదేయని చెప్పవచ్చును.

మేము 'హిందూ ధర్మ పరిరక్షణ' యని పేరు పెట్టుకొన్న వారిని చూచాము. వారిలో హిందూ ధర్మములు తెలిసినవారు ఒక్కరు కూడా కనిపించలేదు. కనీసము భగవద్గీతను చదివినవారు కూడా లేరు. వారి వెనుక యున్న పెద్దలు 'వాడు హిందువు కాదు' అంటే, వాడు హిందువు అయినా కూడా వానిమీద దాడిచేయడము మాత్రమే సభ్యులకు తెలుసు. నేడు ఏమాత్రము జ్ఞానముగానీ, విచక్షణగానీ లేనివారు తమ పెద్దల మోచేతి నీళ్లు త్రాగుచూ వారు ఏమి చెప్పితే అది చేయుచున్నారు. దానివలన ఒకప్పుడు భారతదేశమును ఇందూ (జ్ఞాన) దేశము అని పిలుపించుకొన్న శక్తివంతమైన ఇందువులు ఉన్న దేశములో ఒక్క ముక్క ఆత్మజ్ఞానము తెలియనివారు హిందువులని చెప్పుకోవడము సిగ్గుచేటు. దైవజ్ఞానము తెలిసిన మాకు నేటి జ్ఞానము తెలియని హిందువులు ఇతర మతముల ముందర తలవంపులు తెస్తున్నారు. అందువలన హిందువులయిన వారు తమ జ్ఞానమును కొంచెమయినా తెలియండి. హిందువులకు మిగతా మతముల ముందర గౌరవమును కల్గించండి. నేడు అగ్రకులముల చేతిలో చిక్కుకొన్న హిందూ సంస్థలలో పని చేయువారు తమ పెద్దలు చెప్పేది మంచో, చెడో ఆలోచించి పని చేయండి. అలాకాకుండా వారి మాటలకు ప్రోత్సహించబడి ఎవరిని కొట్టమంటే వారిని కొట్టడము, ఎవరిని తిట్టమంటే వారిని తిట్టడము చేయవద్దండియని చెప్పుచున్నాము. ఇదంతా మా

అనుభవముతో చెప్పుచున్నాము. నేను స్వచ్ఛమయిన హిందువుగా యుండి అద్వైతము, ద్వైతమును స్థాపించిన సిద్ధాంతకర్తలతో సమానముగా త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించిన మమ్ములనే హిందువులు కాదు అన్నవారు కలరు. ఇందూ అని వ్రాస్తే 'హిందూ అనునది మా మతము, ఇందూ అనునది మీ మతము' అని చెప్పినవారు కలరు.

ఇట్లు హిందూమతమును చీల్చుతూపోతే వీళ్లు హిందూ మతమును రక్షించినట్లా, భాగాలు చేసి చిన్నగా చేసినట్లా? ఒకప్పుడు హిందువయిన బుద్ధున్ని ప్రక్కకు పంపి బుద్ధునిది ప్రత్యేక మతమని చెప్పి ఒక్కమారుగా హిందూమతము నుండి కొన్ని లక్షలమందిని కోల్పోవునట్లు చేసినవారు హిందూ పెద్దలే కదా! అలా చేయడమునకు కారణము కులవివక్ష యని కళ్లు తెరచి చూచినవారికి ఎవరికయినా కనిపిస్తుంది. నేడు కూడా అదే విధానము కొనసాగుచున్నందుకు మేము చింతించుచున్నాము. మా బోధలను అడ్డుకొన్న హిందువులు, మా ప్రచారమును అడ్డుకొన్న హిందువులు, మా భక్తుల మీద దాడులు చేసిన హిందువులు నేడు కలరు. హిందువులయిన మా మీదనే దాడులకు ఉసికొలుపు హిందూ మతరక్షణ సంస్థలు ఉన్నాయంటే ఆ సంస్థల పెద్దలు మా మీదికి మిగతా హిందువులను పురికొల్పుచున్నారంటే కేవలము కుల వివక్ష యని తెలియుచున్నది. ఆనాటి బుద్ధుడు క్షత్రియుడు. నేడు మేము కమ్మ కులమునకు చెందిన వారము. అందువలన మేము చెప్పే భగవద్గీత పరమత సంబంధమైనదట. భగవద్గీత పరమతమునకు సంబంధించినది అంటే వారు హిందూ రక్షకులా, హిందూ భక్షకులా పాఠకులు మీరే ఆలోచించండి! అద్వైత, ద్వైత సిద్ధాంతములవలె త్రైత సిద్ధాంతమును, భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తి యోగములో 16, 17 శ్లోకములను పునాదిగా చేసి చెప్పుచున్నా, మాది క్రైస్థవమట. హిందువుగా

యున్న నన్నే క్రైస్థవుడు అను సంస్కారవంతులున్న నేటి హిందువులు ఇతర మతముల ముందర భంగపడు ప్రశ్నలు అడుగడము మంచిది కాదని, ఆ ప్రశ్నలలోని తప్పులు చెప్పుచున్నాము, ఇప్పుడయినా గ్రహించండి.

**వారి ప్రశ్న :- మిగతా మతాలన్నీ ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రవక్త మీద ఆధారపడి నిర్మింపబడినవయితే, హిందూ మతము మాత్రము ఏ వ్యక్తి మీద ఆధార పడలేదని మీకు తెలుసా?**

**మా జవాబు :-** హిందుత్వము మొదట మతము కాదని, క్రైస్థవము వచ్చిన తర్వాత హిందూమతమును ప్రజలే పెట్టుకొన్నారని, అంతవరకు అది మతము కాదని మీకు తెలుసా?యని మేము అడుగవలసి వచ్చుచున్నది. హిందుత్వము యొక్క అసలు పేరు ఇందు పదముతో యున్నది. కేవలము 150 సంవత్సరముల క్రిందట ఇందూ అను పదము హిందూగా మారిపోయినదని మీకు తెలుసా? ఇందు అంటే జ్ఞాని లేక జ్ఞానము. ఒకప్పుడు దేశములో ఎక్కువ శాతము జ్ఞానులు ఉండుట వలన ఆనాడు భారతదేశమును 'ఇందూ దేశము' అని అన్నారు. ఇందూ దేశము అనగా జ్ఞానుల దేశము అని అర్థము. ఇందూ అనగా జ్ఞాని అని అర్థము, కావున మతము అను పదము జ్ఞానులకు వర్తించదు. జ్ఞానమార్గము అని చెప్పుటకు జ్ఞాన పథముయని చెప్పవచ్చును. అందువలన జ్ఞానమునకు పథము ఉంటుందిగానీ మతము ఉండదు. అందువలన ఇందుత్వము ఎప్పటికీ మతము కాదు. నేడు ఇందువులకు మతమును అంటగట్టడము సరియైన పని కాదు. ఇందువుది పథమేగానీ, మతముకాదు. కావున ఇప్పటికీ హిందూ మతము అనుట సరికాదు. హిందూ స్వామీజీలయిన చాలామంది హిందు అను పదమును ఒప్పుకోలేదు. చిన్నజీయర్ స్వామిగారు ఈ మాటను పూర్తిగా ఖండించాడు. అలా అంటే మన తలను మనమే

తీసేసుకొన్నట్లు యని కూడా చెప్పాడు. దీనినిబట్టి మనది హిందూ మతము యని చెప్పుకోవడము మంచిదికాదు. ఇందుత్వము ఎప్పటికీ మతము కాదు.

ప్రతి మతము ఒక ప్రవక్త మీద ఆధారపడి నిర్మించబడినది యని అన్నారు. ప్రవక్తకు మతమునకు ఏమాత్రము సంబంధము లేదు. ఎందుకనగా! ఎందరో ప్రవక్తలు పుట్టారు. వారిని అనుసరించి మతములు పుట్టియుంటే నేడు మతములు వందల సంఖ్యలో యుండేవి. గ్రంథములను బట్టి మతములు వచ్చాయి, అది కూడా మనుషులు నిర్మించినవే మతములు. బైబిలు గ్రంథమును అడ్డము పెట్టుకొని ప్రజలు క్రైస్థవ మతమును తయారు చేసుకొన్నారు. ఏసు ప్రవక్త అయినా ఆయన బ్రతికియున్నప్పుడు క్రైస్థవ మతము తయారు కాలేదు. ఏసు ప్రవక్త చనిపోయిన ఏడెనిమిది సంవత్సరములకుగానీ క్రైస్థవ మతము తయారు కాలేదు. దీనినిబట్టి చూస్తే ప్రవక్తలనుబట్టి మతములు తయారు కాలేదు. గ్రంథములనుబట్టి అందులోని జ్ఞానము అర్థమయిన దానినిబట్టి మనుషులే మతములను నిర్మించుకొన్నారు. ముహమ్మద్ ప్రవక్తయున్న రోజులలో కూడా మతము తయారు కాలేదు. ముహమ్మద్ ప్రవక్త దేవున్ని విశ్వసించిన వానిని 'ముస్లీమ్'యని అన్నాడుగానీ ఆనాడు ముస్లీమ్ మతము లేదు. ముహమ్మద్ ప్రవక్తగారు చనిపోయిన తర్వాత కొన్ని సంవత్సరములకు హదీసు గ్రంథములు వ్రాసిన పెద్దలు ముస్లీమ్ మతమును తయారు చేశారు. వాస్తవముగా ఖుర్ఆన్ గ్రంథమును బట్టి ముస్లీమ్ మతము తయారు కాలేదు. హదీసు గ్రంథమునుబట్టి ముస్లీమ్ మతము, మత నియమములు తయారయినవి. వాస్తవముగా ఒక్క హిందూ మతమునకే కాదు, మూడు మతములకు ప్రవక్తలు లేరు. క్రైస్థవ మతమును చూచి హిందూమతము తయారుకాగా, క్రైస్థవ మతమువలె హదీసు

పండితులు ముస్లీమ్ మతమును నిర్మించారు. ఇదంతా చరిత్రను పరిశీలించిన వారికి తెలియును. దీనినిబట్టి చూస్తే నేడు హిందువులు ఇతర మతములను ప్రశ్నించబోయి తామే ప్రశ్నించబడు స్థితిని ఏర్పరచు కొనుట చింతించదగ్గ విషయము. కొట్టపోయి కొట్టించుకొన్నట్లు ఇతర మతములను ప్రశ్నించపోయి, చివరకు తెలివితక్కువ ప్రశ్న వలన ప్రశ్నించ బడుచున్నారు.

**వారి ప్రశ్న :- మిగతా మతాలు పుట్టిన కాలాలు చెప్పగలరు. కానీ హిందూ మతము అనాదిగా ఉందని మీకు తెలుసా? అందుకే దానిని మానవ ధర్మమనీ, సనాతన ధర్మమని అంటారని మీకు తెలుసా?**

**మా జవాబు :-** హిందూమతము క్రైస్థవ మతము తర్వాత రెండవ మతముగా పుట్టినదని మీకు తెలుసాయని? మేము అడుగుచున్నాము. హిందూ మతములో హిందువులుగా యున్నవారు తమ మతము ఎప్పుడు పుట్టిందని తెలియకుండా ఇతరులను ప్రశ్నలు అడిగితే ఏమి బాగుండును. వాస్తవానికి మనది మతమే కాదు. పథమని చెప్పుకోవాలి. మిగతా మతములు ఎప్పుడు పుట్టినది చెప్పవచ్చును. అట్లే హిందూ మతము ఎప్పుడు పుట్టిందని కూడా చెప్పవచ్చును. క్రైస్థవ మతము 2000 సంవత్సరములప్పుడు పుట్టియుంటే, హిందూమతము 1995 సంవత్సరములప్పుడు పుట్టి యున్నదని చెప్పవచ్చును. మొదట లేని మతము రావాలంటే దానికి కొంత చరిత్ర ఉంటుంది. ఆ చరిత్ర ప్రకారము చూస్తే క్రైస్థవ మతము పుట్టిన తర్వాత ఐదు సంవత్సరములకు హిందూమతము పుట్టినది. అంతవరకు అది మతమే కాదు.

**వారి ప్రశ్న :- మిగతా మత గ్రంథాలన్నీ వాటి ప్రవక్తల జీవితాల ఆధారముగా**

**వ్రాయబడిన పుస్తకాలు. కానీ వేదాలు ఒకరు వ్రాసినవి కావు. తపస్సు ద్వారా దర్శించినవని మీకు తెలుసా?**

**మా జవాబు :-** ఏదో ఒకటి మాట్లాడితే ఎలా సరిపోతుంది? ఇతర మతములను ప్రశ్నలడిగేటప్పుడు హిందువులు గర్వముగా తలెత్తుకొనునట్లు ప్రశ్నించవలెను. అట్లుకాకుండా ప్రాథమిక జ్ఞానము ఏమాత్రము తెలియకుండా ప్రశ్నించితే అది తెలివితక్కువ ప్రశ్నయగును. అందులోని సత్యము తెలిసి, ఎదుటివాడు తిరిగి ప్రశ్నించితే నోరు మెదపలేని పరిస్థితి ఏర్పడును. ఇక్కడ 'వేదాలు ఒకరు వ్రాసినవి కావు, తపస్సు ద్వారా దర్శించినవియని' అన్నారు. తపస్సు అంటే ఏమిటో తెలుసా? **"తపస్విభ్యోధికో"** "తపస్సు చేయువారికంటే అధికులున్నారని" భగవద్గీత లోని ఆ మాట ద్వారా తెలియుచున్నది. తపస్సు ద్వారా వేదాలు కనిపిస్తాయని చెప్పడము మరీ విడ్డూరము. వేదాలు ఒకరు వ్రాసినవి కావు అని అన్నారు. వేదాలు వ్రాసినవి కావు అని చెప్పడమును బట్టి ఈ ప్రశ్న వేసిన వారికి చరిత్ర ఏమాత్రము తెలియదని అర్థమగుచున్నది. చరిత్ర ఏమాత్రము తెలియకపోయినా ఇతరులను విమర్శించితే సరిపోవునా? వేదాలు ద్వాపర యుగములో వ్యాసుని చేత వ్రాయబడినవి. వ్యాసుడు, వేదాలు, పురాణాలు వ్రాయడము వలన, వాటిని అందరూ చదివి వేదాలు గొప్పవని అనుకోవడము వలన, దేవుడు మనిషి అవతారములోనికి వచ్చి భగవద్గీతను చెప్పవలసి వచ్చినది. భగవద్గీతలో సాంఖ్య యోగమందు **"త్రైగుణ్య విషయా వేదా"** అని చెప్పారు. దాని అర్థము మూడు గుణముల విషయములే వేదాలు అని చెప్పబడినది. గుణాలతో కూడుకొన్నవి వేదాలయినప్పుడు **"గుణమయీ మమ మాయా"** అని అన్నారు. 'గుణములతో కూడుకొన్నది నా మాయ' అని అన్నారు. దీనినిబట్టి **'వేదములు మాయ'** అని తెలిసి పోవుచున్నది. మాయను జయించుటకు భగవద్గీతలో జ్ఞానమును చెప్పాడు.

దీనినిబట్టి చూస్తే వేదములు గొప్పగా చెప్పుకొను గ్రంథములు కూడా కాదు. అయినా హిందువులు కొందరు వేదముల ఆధ్యాయనము చేయుచూ ప్రతి ఆరాధనయందు వేదమంత్రములను ఉపయోగించు చున్నారు. హిందువులు వేదాలే ముఖ్యము అని అంటున్నారు. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతను స్వయముగా దేవుడే భగవంతునిగా వచ్చి చెప్పితే, అంతేకాక వేదములను మాయయనీ, గుణములతో కూడుకొన్నవని చెప్పినా, ఎందుకు వేదాల మీద అంతమక్కువ చూపుతున్నారు? భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమునందు, 48, 53 శ్లోకములలో **"వేదముల వలన దేవుడు తెలియబడడు"** అని చెప్పియున్నా దానిని చూడకుండా, చూచినా లెక్కించక, వేదములే హిందువులకు ప్రామాణిక గ్రంథములనుట ఆశ్చర్యము కాదా!

వేదములను గ్రంథరూపముగా చేసిన వ్యాసుడే చివరిలో భగవద్గీతను తెలిసిన తర్వాత తాను వేదములను వ్రాసినందుకు సిగ్గుపడి, తాను చేసిన తప్పును సరిదిద్దుకొనుటకు పాశ్చాత్తాపపడిన వ్యాసుడు భగవద్గీతను గ్రంథరూపముగా చేయను మొదలుపెట్టాడు. భగవద్గీతను పూర్తి చేసి ఎంతో సంతోషపడ్డాడు. తాను వ్రాసిన భగవద్గీతలో వేదములు, యజ్ఞములు, తపస్సులు అధర్మములుగా యున్నవని వ్రాశాడు. వేదముల గురించి తెలియనప్పుడు గ్రంథరూపము చేసిన దానివలన ఎందరో అధర్మముల పాలయినట్లు గ్రహించి, తన తప్పుకు ప్రాయశ్చిత్తముగా భగవద్గీతను రచించడమే పరిష్కారమని తలచి, గీతను రచించిన తర్వాత తృప్తిపొందాడు. ఈ విషయము బయటి ప్రపంచమునకు తెలియదు. హిందువులకు ప్రామాణిక గ్రంథము ప్రథమ దైవ గ్రంథమని పేరుగాంచిన భగవద్గీత. దేవుడు భగవంతునిగా వచ్చి చెప్పినది భగవద్గీత. భగవద్గీత

ఆత్మజ్ఞానమును సంపూర్ణముగా బోధించినది. అందువలన భగవద్గీత బ్రహ్మవిద్యా శాస్త్రముగా పేరుపొందినది. బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి చెప్పినబోధ యుండుట వలన భగవద్గీతను సంపూర్ణ బ్రహ్మ విద్యా శాస్త్రము అని అనవచ్చును.

'వేదములు త్రి గుణములతో కూడుకొన్నవని' భగవద్గీతలో సాంఖ్య యోగమున 45వ శ్లోకములో చెప్పారు. 'గుణములే మాయ' అని విజ్ఞాన యోగమున 14వ శ్లోకమందు చెప్పారు. ఈ రెండు మాటలను చూచిన తర్వాత కూడా వేదములు హిందువుల ప్రమాణ గ్రంథములని చెప్పడము పెద్ద తప్పు. భగవద్గీత రాకముందు వేదములు ప్రామాణిక గ్రంథములని వ్యాసుడు చెప్పాడు. భగవద్గీత వచ్చిన తర్వాత వ్యాసుడే వేదములు మాయతో కూడుకొన్నవని చెప్పాడని మరువకూడదు.

**ప్రశ్న :- రాముడు, కృష్ణుడు, బుద్ధుడు మొదలైనవారు అవతార పురుషులు ఒకే పరబ్రహ్మ అవసరాన్ని బట్టి అనేక కాలాలలో, అనేక రూపాలను ధరిస్తాడని, అందుకే హిందువులు 'సృష్ఠిలోయున్న మూలతత్వము ఒక్కటే' దానిని ఋషులు అనేక పేర్లతో పిలుస్తారు. (ఏకం సత్‌విప్రా బహుదా వదంతి) అనబడే అద్భుత సత్యాన్ని ఏనాడో కనుగొన్నారని మీకు తెలుసా?**

**జవాబు :-** రాముడు, కృష్ణుడు, బుద్ధుడు ఒక్కటే యన్నవారు, హిందూత్వము నుండి బుద్ధున్ని బయటికి నెట్టి బుద్ధుని మతము వేరని ప్రచారము చేసి, హిందూమతము నుండి బౌద్ధమతమును వేరు చేసినవారు నేడు బుద్ధుడు, రాముడు, కృష్ణుడు అందరూ ఒకే దేవుని అవతారమేయని ఎలా చెప్పు చున్నారు? హిందూమతము నుండి బౌద్ధమతమును బయటికి పెరికి మీ మతము వేరు, మా మతము వేరు అనినవారే నేడు బుద్ధున్ని రాముడు,

కృష్ణుడుతో సమానముగా చెప్పితే చూచేవారికి ఎట్లుండునో ఆలోచించారా? మీ ఇష్టమొచ్చినప్పుడు ఇష్టమొచ్చినట్లు మాట్లాడితే వినేదానికి ప్రజలు బుద్ధిలేని దద్దమ్మలు కాదని తెలియండి. నేడు హిందూ మత రక్షకులమని పేరు పెట్టుకొన్నా ముందు మీరే హిందూ ధర్మ భక్షకులని అందరికీ తెలుసు.

**ప్రశ్న :- అనంతమైన దేవున్ని చేరుకోవడానికి అనంతమైన మార్గాలు ఏర్పడ్డాయి. ఏ పేరుతో కొలిచినా చేరేది ఆ ఒక్క దేవుడినేనని హిందువుల విశ్వాసము. అందువలన ఏ మతస్థుడైనా తమ దేవుడే గొప్పవాడు. ఇతర దేవుళ్లు గొప్పవారు కాదు అని అంటున్నారంటే వారికి ఏ దేవున్ని గురించి ఏమీ తెలియదు. స్వలాభాపేక్షతో దేవున్ని వ్యాపార వస్తువుగా మార్చి ప్రజలను మోసము చేస్తున్నారని అర్థము.**

**జవాబు :-** దేవుడు అనంతమైనవాడు అనడములో తప్పులేదు. అయితే ఆయన్ను చేరుకోవడానికి అనంతమైన మార్గాలు ఉన్నాయి అనడము పెద్ద తప్పు. అలా అనంతమైన మార్గాలు ఉన్నప్పుడు, దేవుడు ప్రజలకు ఏమీ చెప్పక ఊరక ఉండేవాడు. ప్రజలకు జ్ఞానముతో అవసరము లేదు. వారి ఇష్టమొచ్చినట్లు వారు ఆరాధించవచ్చును. ఏ పేరుతో కొలిచినా దేవునికే చేరేటప్పుడు **"యాన్తి దేవవ్రతాన్ దేవాన్"** అని చెప్పేవాడు కాదు. "ఏ దేవున్ని కొలిస్తే ఆ దేవునికే చేరును, నన్ను చేరవు" అని భగవద్గీతలో చెప్పేవాడు కాదు. అలా తప్పు చేయుచున్నారని తెలిసిన దేవుడు తనను చేరుటకు జ్ఞానమును భగవద్గీతలో బోధించాడు. తనను చేరుటకు వేరు మార్గములు లేవు యనీ, తనను చేరుటకు మూడే మార్గములు కలవనీ, అవే యోగ మార్గములనీ చెప్పాడు. ఆ మూడు యోగమార్గముల పేర్లే బ్రహ్మయోగము, కర్మయోగము, భక్తియోగము. ఇది స్వయముగా దేవుడే చెప్పియుండగా వాటిని కాదని అనేక మార్గములున్నాయని చెప్పడము

దేవుని నిర్ణయమునకు, దేవుని జ్ఞానమునకు పూర్తి వ్యతిరేఖము. అలా చెప్పడము హిందుత్వము కాదు.

**ప్రశ్న :- క్రీస్తు తన 14వ ఏటనుండి 29వ ఏటవరకు అనగా 16 సంవత్సరముల కాలము ఎక్కడ గడిపాడో సెలవిస్తారా? ఆ కాలములో భారత దేశములోని కాశ్మీరులో బౌద్ధ ఆశ్రమాలలో కాలము గడిపాడని రష్యాలోని ఒక దిన పత్రిక ప్రచురించింది. దీనికి మీ సమాధానము ఏమిటి?**

**జవాబు :-** ఈ మాటను అడగడము వలన మీరు అనవసరముగా ఇతర మతాలలో జోక్యము చేసుకొన్నట్లున్నది. ఎవరో రష్యావారు వ్రాసిన పత్రిక నిజమని మీరు ఎలా చెప్పగలరు? ఏసు తన 29వ ఏడు పూర్తి అయ్యేవరకు తన ఇంటిలో తల్లి, తమ్ముళ్ళ మధ్య ఉంటూ చెక్క సామాన్ల పని చేసేవాడు. విదేశాలలో ఆచారి కులమునకు సమానముగా చెప్పు కులమున పుట్టి, చేతి పని చేయుచూ మంచాలు, కుర్చీలు, బల్లలు చేసేవాడు. తన 29వ ఏడు అయిపోగానే తల్లితో చెప్పి ఇల్లు వదలి వచ్చాడు. మూడు సంవత్సరములు ఇశ్రయేల్ దేశములో గడిపిన ఏసు తన శిలువ మరణము తర్వాత ఇండియాకు వచ్చి, గుజరాత్‌కు రాజస్థాన్‌కు మధ్య భాగములో అడవి ప్రాంతములో 30 సంవత్సరములు బ్రతికాడని నిరూపణలతో సహా చెప్పాము. ఆయన ఎట్లు చనిపోయినది, ఎవరు సమాధి చేసినది, ఎక్కడ సమాధి చేసినది కూడా చెప్పాము. **"ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?"** అను మా రచనా గ్రంథములో ఈ విషయమంతాయుంది చూడండి. ఎవరో రష్యావారు అదియూ అబద్దాల పుట్టలయిన న్యూస్‌పేపర్ ఆధారముగా చెప్పేమాట పూర్తి అసత్యము. మేము మతాలకు అతీతముగా సత్యశోధన చేశాము. అప్పుడు రెండు మతములలో యున్నది ఒకే దేవుని

జ్ఞానమనీ, రెండు మతములలో చెప్పినది ఒకే దేవున్ని గురించియనీ, చెప్పినవాడు కూడా ఒక్కడేయని తెలిసింది. ఈ విషయము తెలియాలంటే మా రచనలలోని **"శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!"** అను గ్రంథములో 'కృష్ణుని మరణము లోకమునకు కనువిప్పు' అనునది చదవండి.

**ప్రశ్న : - ఏసుక్రీస్తు కన్యకు జన్మించలేదనీ, ఆయనకు నలుగురు సోదరులున్నారనీ, ఆయనకు వివాహము అయినదనీ, భార్యపేరు మేరి మెగ్దాలిన్ అనీ, ఆయన శిలువపై మరణించలేదనీ, 1947లో జెరూసలేమ్‌కు దగ్గరలోని ఖుమ్రాన్ గుహలలో లభించిన పురాతన హిబ్రూ భాషలో తోలుపై వ్రాయబడ్డ వ్రాత పత్రాలు రుజువు చేశాయని మీకు తెసుసా? ఈ సత్యాలను ప్రపంచానికి తెలియకుండా ప్రపంచ క్యాథలిక్ క్రైస్థవ కేంద్రము (వాటికన్) సుమారు 50 సంవత్సరాలు విఫలయత్నము చేసిందని మీకు తెలుసా?**

**జవాబు :-** మనము హిందువులము. మన హోదా గొప్పది. అయినా ఇతరుల విషయమును ప్రస్తావించడము చౌకబారు పనియగును. ఇవన్నీ అనవసరముగా మన మర్యాదను పోగొట్టుకొను మాటలు తప్ప ఏమీ కావు. పైన ప్రస్తావించినవన్నీ సత్యమే అయినా మనకు వచ్చు లాభమేమి? విజ్ఞులయినవారు ఎవరూ అట్లు మాట్లాడరు. అతను ఎలా పుట్టినా, ఎలా పెరిగినా, భార్య ఉన్నా లేకపోయినా, ఆయనలో చూడవలసినది ఆధ్యాత్మిక జ్ఞానము. అంతేగానీ వ్యక్తిగత విషయములలోనికి దిగి మనము మాట్లాడితే వారు కూడా మీ కృష్ణుడు అలాంటివాడు, ఇలాంటివాడు అన్నారనుకో అప్పుడు ఎక్కడో యున్న కృష్ణున్ని అనవసరముగా ఇతరుల చేత విమర్శింప చేసినట్లగును.

ఏసు జీవితమును గురించి క్రైస్థవులకే సరిగా తెలియదు. నేను క్రైస్థవులను, మిమ్ములను ఇద్దరినీ కలిపి ప్రశ్నిస్తాను. మీరుగానీ, వారుగానీ

జవాబు చెప్పగలరా! చూడండి. ఏసు 63 సంవత్సరములకు చనిపోయాడని ఎవరికయినా తెలుసా? ఆయన రహస్య జీవితము 30 సంవత్సరములు సాగినదని హిందువులకుగానీ, క్రైస్థవులకుగానీ తెలుసా? ఆయన తన రహస్య జీవితము 30 సంవత్సరములు భారతదేశములో గడిపాడని ఎవరికయినా తెలుసా? ఏసు తన రహస్య జీవితము ఇంకొకరితో గడిపాడు, తోడున్నవారు ఎవరో తెలుసా? తోడున్న వాడు 20 సంవత్సరములు ఉన్నాడని తెలుసా? ఏసు చనిపోగా ఆయన శరీరము ఒక నది ఒడ్డున పూడ్చబడినదని తెలుసా? ఏసు శరీరమును మనుషులు ఎవరూ సమాధి చేయలేదని ఎవరికయినా తెలుసా? ఇట్లు ఎన్నో విషయములు క్రైస్థవులకే తెలియవు. మనిషి కనిపిస్తే వాడు ధరించిన దుస్తులను చూడకూడదు. వాని తలలోని బుద్ధిని చూడాలి. అలాగే ఏసు ఎలా బ్రతికాడనునది సమస్య కాదు, ఏసు ఏమి బోధించాడనునదే సమస్య. ఏసు చెప్పిన జ్ఞానమును చూచుట విజ్ఞుల పని. ఈ విషయములన్నీ తెలియాలంటే మా రచనలలోని **"ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?"** అను చిన్న గ్రంథమును చదవండి.

**ప్రశ్న :- ప్రస్తుతము ప్రాశ్చాత్య దేశాలలో నూటికి 20 మంది కూడా చర్చిలకు వెళ్ళడము లేదనీ, ఆ సంఖ్య రోజురోజుకి తగ్గిపోతున్నదని తెలుస్తుంది. దానికి కారణము ఏమిటో మీరు చెప్పగలరా? దానికి కారణము వారికి క్రైస్థవ మతము మీద విశ్వాసము సడలిపోవడము కాదా!**

**జవాబు :-** ఆ దేశాలలోని క్రైస్థవులు చర్చికి పోతే మనకేమి? పోకపోతే మనకేమి? వాళ్లు చర్చికి పోతే మనకు ఏమైనా మోక్షము వస్తుందా? పోకపోతే రాదా! ఇవన్నీ మతద్వేషముతో మాట్లాడు మాటలుగానీ వేరుకాదు. మనకు సంబంధము లేని విషయము ప్రస్థావించడమే తప్పు. నేడు మన దేశములో

హిందువులు ఎంతమంది దేవాలయములకు పోవువారున్నారు? కేవలము 20 శాతము మంది మాత్రమే దేవాలయములకు పోవుచున్నారు. 80 శాతము మంది దేవాలయములలోనికి పోనివారు గలరు. దీనిని గురించి మీరేమి చెప్పగలరు? మన విషయము వారికి అవసరము లేదు. వారి విషయము మనకు అవసరము లేదు. అనవసరముగా ఇతరుల విషయములను ప్రస్థావించకూడదు.

**ప్రశ్న :- గత రెండు వేల సంవత్సరములలో ఆత్మసాక్షాత్కారాన్ని పొంది పరమ పదమును చేరుకొన్న యోగులు, ఋషులు, మునులు, మహాత్ములు హిందూ ధర్మములో కోకొల్లలుగా యున్నారు. మరి క్రైస్థవ మతములో ఆ స్థాయికి చేరుకొన్న మహాత్ములు ఎందరున్నారో చెప్పగలరా?**

**జవాబు :-** నేను హిందువునే. హిందూమతములో ఎవరు ఆత్మసాక్షాత్కారాన్ని పొంది పరమ పదమును చేరుకొన్నారో చెప్పగలరా? కోకొల్లలుగా యున్నారని అన్నారు. కనీసము ముగ్గురిని చెప్పండి. లేకపోతే ఇద్దరినయినా చెప్పగలరా! యని మేము అడుగుచున్నాము. ఇంతవరకు ఆత్మంటే ఏమిటో, ఎట్లుంటుందో ఎవరికీ తెలియదు. ఆత్మే తెలియనిది ఆత్మసాక్షాత్కారము అనునదే ఉండదు. మోక్షము అనునది సులభమైనది కాదు. ద్వాపర యుగము చివరిలో భీష్ముడు, కలియుగములో దాదాపు 350 సంవత్సరము లప్పుడు వేమనయోగి గారు ముక్తిని పొందినట్లు మాకు తెలియును. అంత తప్ప ఎవరూ ముక్తికి పోలేదు. మిగతావారు పోలేదని మీకెట్లు తెలుసు? అని ప్రశ్నిస్తే దానికి మా వద్ద జవాబు కలదు. అదేమనగా! ఏ మనిషిగానీ ముక్తి పొందుటకు కాలము కలిసి రావలసియుంటుంది. కలిసి అనగా నాలుగు కాలములు కలిసి రావలసియున్నది. ఒకటి పగలు, రెండు శుక్ల పక్షమి, మూడు ఉత్తరాయణము. ఈ మూడు కాలములు కలిసి

వచ్చినా చివరిలో సూర్యరశ్మి కూడా ఉండవలెను. ఇవన్నీ కలిసివచ్చినప్పుడు అదియూ యోగి అయిన వానికే మోక్షము పొందు అర్హత యుండును. ఈ మధ్య కాలములో చనిపోయిన ఎంత పెద్ద స్వామిజీలయినా వారికి కాలము కలిసి రాలేదు. ఒకటి రెండు కలిసిరాక పోవడము వలన వారు మోక్షమును పొందలేదు. చనిపోయిన మహాత్ముల, స్వామీజీల మరణ సమయమును చూస్తే ఏదో ఒకటి లేక రెండు తప్పిపోవడము వలన రెండు వేల సంవత్సరముల నుండి హిందువులలో ఒకరు ఇద్దరు తప్ప ఎవరూ మోక్షమును పొందలేదు. క్రైస్థవులలో అదియూ లేదు. అసలు విషయము ఇలా ఉండగా మీరు కోకొల్లలుగా ముక్తిపొందారు అనడము పూర్తి అసత్యము.

**ప్రశ్న :- లౌకిక వ్యవస్థ అంటే అన్ని మతాలను గౌరవించడమని మీకు తెలియదా? తెలిస్తే ఎందుకు ఇతర మతాలను దూషిస్తున్నారు?**

**జవాబు :-** ఈ మాట వారే మిమ్ములను అడిగితే మీరేమంటారు? అనవసరముగా వారిని ప్రస్తావించి అగౌరవముగా మాట్లాడినది మీరే కదా! మీరు వారినే అంటూ వారికే లౌకికము నేర్పితే సరిపోతుందా. ఇతరులను గౌరవించడము ముందు మనమే నేర్చుకుందాము.

**ప్రశ్న :- రాముడు వారధి కట్టడానికి కోతులను, ఉడుతలను వాడుకొన్నాడు. దేవుడైతే ఎందుకు వాడుకొన్నాడు? తానే కట్టుకోలేకపోయాడా? అని ప్రశ్నిస్తారు. మరి క్రీస్తును శిలువ వేసేటప్పుడు ఎందుకు తనను తాను రక్షించుకోలేకపోయాడు? అటువంటి వాడు ఇతరులను ఎలా రక్షించుతాడు?**

**జవాబు :-** రామున్ని గురించి వాళ్లు ఎవరూ అడుగలేదు గానీ మీరే చెప్పి రామున్ని బయటకు తెచ్చారు. ఏసును శిలువ వేశారు నిజమే. అయితే ఏసు ఎప్పుడయినా నేను దేవున్నని గానీ, నేను రక్షిస్తానని గానీ

ఎవరితోనయినా చెప్పాడా? ఎవరితోనూ చెప్పలేదు. అటువంటప్పుడు ఆయన ఇతరులను ఎలా రక్షించుతాడు అని మీరు ఎలా అడుగుచున్నారు? ఆయన తాను ఎవరినీ రక్షిస్తానని ఏ సందర్భములోనూ చెప్పలేదు. ఒకప్పుడు ద్రాక్షరసము తన శిష్యులకు ఇచ్చి **"ఇది నా నిబంధన రక్తము దీనిని త్రాగుము. దీనిని త్రాగితే నా నిబంధన రక్తము వలన మీకు పాప క్షమాపణ కలుగుతుంది"** యని చెప్పాడు. అప్పుడు ఆయన ఉదాహరణకు ద్రాక్షరసమును చూపి దానిని తన 'నిబంధన రక్తము' అని అన్నాడు. నిబంధన రక్తము అంటే ఏమిటో ఇంతవరకు క్రైస్థవులకు ఎవరికీ తెలియదని చెప్పుచున్నాము. మాకు ఏసు వలన పాపక్షమాపణ జరుగునని వారు చెప్పుకోవడమున్నదిగానీ పాపక్షమాపణ ఎలా జరుగునో వారికే తెలియదు. ఏసు తమ పాపములను క్షమిస్తాడని క్రైస్థవులు చెప్పుచున్నారు. అయితే ఏసు ఆ మాట ఎవరితోనూ చెప్పలేదు. తన నిబంధన రక్తము వలన పాప క్షమాపణ జరుగునన్న మాట వాస్తవమే. అయితే నిబంధన రక్తము ఏమిటో, అది ఎక్కడ దొరుకునో ఎవరికీ తెలియనప్పుడు, మీరు ఈ ప్రశ్నను అడుగడము వలన ఆయన మాట మీకు కూడా అర్థము కాలేదని తెలియుచున్నది. ఆ దినము ఆ మాటను క్రైస్థవులకు ఒక్కరికే చెప్పలేదు. అది సర్వమానవులకు చెప్పాడు. ఆ మాటను ఎవరయినా ఏ మతస్థులయినా అర్థము చేసుకోవచ్చును. ఏసు ఉన్న దినములలో భూమి మీద మతములు లేవని మరువకూడదు. ఆయన వచ్చిపోయిన తర్వాత కొన్ని సంవత్సరములకు మతము తయారయినది. ఆయన మతములు లేనప్పుడు సర్వమానవులకు చెప్పినమాట. అది క్రైస్థవులకు సంబంధము లేని మాట. ఆ రోజు ఏసు క్రైస్థవుడు కూడా కాడు. ఆచారి కులమున పుట్టి, చెక్క పని చేసుకొని బ్రతికేవాడు. బ్రహ్మముగారు ఇల్లు వదిలి దేశము మీదికి వచ్చినట్లు ఆయన కూడా 30వ సంవత్సరము ప్రారంభములోనే ఇల్లు వదిలి వచ్చాడు.

నేడు క్రైస్థవులు తమది ప్రత్యేకమైన మతమని చెప్పుకొంటున్నారు. కొందరు హిందూ దేవుళ్లకు వ్యతిరేఖముగా మాట్లాడడము నేను కూడా చూచాను. వారు మాట్లాడుచున్నారని మనము కూడా మాట్లాడడము మంచిదా? అలా మాట్లాడితే గాడిద గుర్రము రెండూ ఒకటి అయినట్లు కాదా! అందువలన మనము హుందాగా ఉందాము. చిల్లరగా ఎవరినీ ప్రశ్నించక మన జ్ఞానమును మనము తెలుసుకొందాము.

**ప్రశ్న :- ఏసుక్రీస్తు ప్రజలను ఉద్ధరించడానికి తన రక్తమును చిందించాడని క్రైస్థవులంటారు. తనను తాను కాపాడుకోలేనివాడు ఇతరులను ఎలా కాపాడగలడు?**

**జవాబు :-** క్రైస్థవులు అనడము అటుంచండి. ఏసు తన మాటలలో స్వయముగా తన శిష్యులకు ద్రాక్షరసమిచ్చి **"ఇది చిందించబడుచున్న నా రక్తము. దీనిని త్రాగుము. నా నిబంధన రక్తము చేత మీ పాపములు క్షమించబడును"** అని చెప్పియున్నాడు. ఈ మాట అక్షరాలా భగవద్గీతలో యున్నది. అట్లే ఖుర్ఆన్ గ్రంథములో యున్నది. హిందువులకు భగవద్గీతే సరిగా తెలియనప్పుడు, భగవద్గీతలో క్రీస్తు చెప్పిన మాట ఉందంటే విడ్డూరముగా యుండును. అవును, నా మాట విడ్డూరముగానే యుండును. అంతమాత్రమున నా మాటను అసత్యము అని అనుకోవద్దండి. నేను చెప్పినమాట నూటికి నూరుపాళ్లు సత్యము. నేడు క్రైస్థవులు కూడా అదే మాటను చెప్పుచున్నారు. ఏసు చిందించు రక్తము వలన పాప క్షమాపణ కలదని, అందువలన ప్రజలందరూ ఏసును విశ్వసించి క్రైస్థవులుగా మారితే వారి పాపము ఏసు రక్తము చేత కడిగివేయబడును అని అంటున్నారు. వాస్తవముగా చెప్పితే ఏసు తన రక్తము చేత మనుషుల పాపము పోతుందని చెప్పినమాట నిజమే. అంతేగానీ తన రక్తముతో పాపము కడిగివేయబడునని

చెప్పలేదు. తన రక్తమును త్రాగమన్నాడు, పాపములను కడుగుకొమ్మనలేదు. క్రైస్థవులకు బైబిలు గ్రంథములోని ఏసు మాటలు ఏమాత్రము అర్థము కాలేదు. "ఏసు తన రక్తమును శిలువ మీద పాపుల కొరకు కార్చాడు" అని అంటున్నారు. దీనినిబట్టి ప్రజల కొరకు ఏసు చనిపోయినట్లు చెప్పుచున్నారు. ఆయన ఆ విధముగా ప్రజల కొరకు చనిపోలేదు. మనుషులే ఆ రోజు బలవంతముగా ఆయనను చంపారు. ఆయనను చంపిన మనుషులే నేడు "ఆయన ప్రజల కొరకు చనిపోయాడు" అని అంటున్నారు. ఆయన చనిపోక ముందు ప్రజల కొరకు చనిపోతానని ఎక్కడయినా చెప్పాడా? చెప్పలేదు. చెప్పనప్పుడు ఆయన ప్రజల కొరకు చనిపోయాడని ఎందుకు అంటున్నారు? ఆయన చావుకు మనుషుల పాపమునకు ఏమి సంబంధము?

ఏసు తన మాటలలో స్పష్టముగా గిన్నెతో ద్రాక్షరసమును ఇచ్చి ఇలా అన్నాడు. **"ఇది నా చిందింపబడుచున్న రక్తము"** అన్నాడు. ఆ మాటలోని అర్థము 'ప్రస్తుతము బయటకు వచ్చుచున్న రక్తము' అనేగా అర్థము. ఆయన జరుగుచున్న కాలమును గురించి చెప్పాడా, జరుగబోవు కాలమును గురించి చెప్పాడా? ఈ విషయమును అటు క్రైస్థవులుగానీ, ఇటు హిందువులు గానీ ఏమాత్రము ఆలోచించలేదు. ఇరువురు గ్రుడ్డిగా మాట్లాడుచున్నారు. ఏసు చనిపోయిన తర్వాత ఆయన శరీరమే లేదు. ఇప్పుడు రక్తము ఎలా వస్తుంది? ఏసు రక్తము వలన పాపము పోతుంది అని చెప్పుటకు ఆయన రక్తమును టన్నుల కొద్దీ డ్రమ్ములలో నింపిపెట్టారా? అలా కూడా జరుగలేదు కదా! అటువంటప్పుడు ఆయన రక్తము విషయము ప్రస్తావించడము క్రైస్థవుల తప్పు. దానినే నిజమనుకోవడము హిందువులది తప్పు.

ఏసు చెప్పిన రోజు **"చిందింపబడుచున్న రక్తము"** అని అన్నప్పుడు ఆయన చెప్పినది నిగూఢమైన విషయమని క్రైస్థవులు అర్థము చేసుకోలేదు. నిబంధన రక్తము అని అన్నప్పుడు ద్రాక్షరసము చూపి రక్తమని ఎందుకు అంటున్నాడని ఎవరూ గ్రహించలేదు. ఆ రోజు ఆయన చెప్పినది నిగూఢమైన జ్ఞానమని తెలియలేకపోయారు. అప్పుడు ఆయన చెప్పిన మాట ప్రకారము నేడు కూడా ఆయన శరీరము ఉంది. ఆయన రక్తము చిందింపబడు చున్నది. ఈ నా మాట వింటే అన్ని మతముల వారికి మతి చలించిపోతుంది. మీకు ఏమయినా ఫరవాలేదుగానీ, ఆయన చెప్పిన మాట పూర్తి సత్యము. వాస్తవముగా నేడు కూడా ఆయన రక్తము చిందింప బడుచున్నది. అదేదో తెలిస్తే ఎవరయినా ఆ రక్తమును గ్రహించగలిగితే, అనగా రక్తమును నీ శరీరములో నింపుకోగలిగితే, ఆ రక్తము వలన నీ శరీరములో యున్న పాపములన్నియూ కాలిపోవుచున్నవి. దానినే 'క్షమించ బడును' అన్నారు. ఇదే భావమును కల్గించు మాట భగవద్గీతలో, బైబిలులో కలదు. అయినా అవి అర్థము కాకుండా పోయాయి. ఏసు రక్తము ఏదో ఏ క్రైస్థవునికయినా తెలుసా? ఆయన శరీరము ఏదో ఎవరికయినా తెలుసా? అని అడుగుచున్నాను. ఇవన్నిటికీ జవాబు లేకుండానే గ్రుడ్డిగా క్రైస్థవులు మాట్లాడుచున్నారు. జ్ఞానముతోనే వారి మాటలను ఇప్పుడు నేను ఖండించినట్లు హిందువులు ఖండించవచ్చును కదా! అట్లుకాకుండా "శిలువ వేసేటప్పుడు తనను తాను కాపాడుకోలేనివాడు ఇతరులను ఎలా రక్షించును?" అని అన్నారు. ఆయన తన మాటలలో ఎవరినీ తాను రక్షిస్తానని చెప్పలేదు. తన రక్తము రక్షిస్తుంది యని మాత్రము చెప్పాడని తెలియవలెను. ఇది బైబిలులో ఏసు చెప్పిన విషయము కాగా! భగవద్గీతలో ఈ విషయము ఎక్కడ చెప్పాడని కొందరు అడుగవచ్చును. అలాగే ఖుర్ఆన్‌లో ఎక్కడ చెప్పాడని కూడా ముస్లీమ్‌లు అడుగవచ్చును. నేను

మూడు గ్రంథములను చదివాను. మూడు దైవ గ్రంథములలో ఒక్కటే దైవజ్ఞానము కలదనీ, మూడు గ్రంథములు ఒకే దేవున్నే బోధించుచున్నవని నాకు తెలిసినది. మీకు ఎందుకు తెలియలేదు?

**ప్రశ్న :- వేదాలు ఒకరు వ్రాసినవి కావు. భగవంతుని ముఖము నుండి వచ్చినవి, వేదాలకు పురాణాలకు వక్రభాష్యము చెప్పి అతి తెలివి ప్రదర్శించకండి. అది మీకే నష్టము!**

**జవాబు :-** క్రైస్థవులు వేదాలకు వక్ర భాష్యము చెప్పునంత స్థోమత లేదు. సంస్కృతము వచ్చిన వారికే వేదములకు భాష్యము చెప్పు స్థోమత యుంటుంది. క్రైస్థవులకు సంస్కృత భాషే రాదు. అటువంటప్పుడు దానిని ఇది అదియని ఏమాత్రము చెప్పలేరు. వక్ర భాష్యమును హిందువులలోనే హిందూమతము మీద పెత్తనమును చెలాయించువారు చెప్పుచుందురు. అంతెందుకు ఇప్పుడు ఈ ప్రశ్నలో కూడా తప్పు మాటలు చెప్పి దారి మళ్లించాలని చూచినట్లు కనిపిస్తూ యున్నది. నేనూ హిందువునే, కావున హిందుత్వమునకు ఎక్కడ నష్టము వాటిల్లుతుందో అక్కడ నేను జోక్యము చేసుకొని హిందుత్వమును కాపాడవలెనని ప్రయత్నము చేయుచున్నాను. హిందూ జ్ఞానమునకు, హిందూ ఆధ్యాత్మిక విద్యకు వేదములు అడ్డంకమనీ, వాటివలన దేవుడు తెలియడనీ, హిందువులకు ప్రామాణిక గ్రంథమయిన, దేవుడు భగవంతునిగా వచ్చి స్వయముగా చెప్పిన భగవద్గీతలో చెప్పడమైనది. అటువంటి వేదములను భగవంతుని ముఖత వచ్చినవంటే భగవంతున్నే అవమానించినట్లగును.

అంతేగాక అధర్మములకు అడ్డుకట్టవేసి ధర్మములను తెలియజేయు భగవద్గీతను అవమానించినట్లగును. వేదములు గ్రంథరూపమైనవని తెలిసి,

అంతవరకు భగవంతునిగా రాని దేవుడు భగవంతునిగా వచ్చి వేదములు గుణములతో కూడుకొన్నవని వాటిని మాయయని చెప్పినది భగవంతుడు. అటువంటి భగవంతుడే వేదములను చెప్పాడని అనడము పెద్ద పొరపాటు. మనుషులు చెప్పినవి వేదములు. సాధారణముగా అయితే ఒక గ్రంథమునకు ఒక గ్రంథకర్త ఉంటాడు. అట్లు ఏ వేదమునకు ఒక గ్రంథకర్త అనువాడు లేడు. కొన్ని వందలమంది వారి మనో భావముల ప్రకారము వ్రాసిన వాటిని సేకరించి ఒక గ్రంథముగా చేసి దానికి ఒక వేదము అని పేరు పెట్టారు. అలా మనుషులు వ్రాసిన వాటిని నాలుగు వేదములుగా వ్రాసిన వాడు వ్యాసుడు. కృత, త్రేతా, ద్వాపర యుగములలో అనేకులు వ్రాసిన వారివారి భావనలను వృథాగా పోకుండా ఒకచోట చేర్చి గ్రంథరూపము చేసినవాడు వ్యాసుడు. అందులో చివరిగా వ్రాసిన వేదము అధర్మణ వేదము. చివరికది అధర్వణ వేదముగా కూడా పిలువబడుచున్నది. వేదము అనగా 'బాధ'యని అర్థము. వేదములు అనగా 'బాధలు'యని అర్థము. మనుషులు వ్రాసిన వ్యాసములను సేకరించి నాలుగు గ్రంథములుగా వ్రాసినవాడు వ్యాసుడు.

వేదములకు ఒక గ్రంథకర్త లేడు. వ్యాసుడు గ్రంథముగా చేసినా వాటిని వ్రాసినవారు అనేకులు. వేదములను వ్రాసినవారి పేరు పూర్తి తెలియకుండా పోతే బాగుండదని వారు వ్రాసిన వ్యాసములోని ముఖ్య భాగమునకు వారు వ్రాసిన పేరే పెట్టడము జరిగినది. ఎవరు వేదమును వ్రాశారో వారి ముఖ్య భాగమునకు ఉపనిషత్‌యని పేరు పెట్టడము, ఆ ఉపనిషత్‌కు వారి పేరే పెట్టడము వలన అది ఫలానా వారే వ్రాశారుయని తెలియుచున్నది. వ్యాసములు వ్రాసినవారే చివరిలో వారి పేరును వ్రాసుకోవడము జరిగినది. వ్యాసములు దాదాపు లక్ష వరకు ఉండేవి.

ముస్లీమ్ పండితులు హదీసులను వ్రాసినట్లు హిందూ పండితులు, మునులు, మహర్షులు మొదలయినవారు వేదవ్యాసములను లక్ష వరకు వ్రాశారు. ముస్లీమ్ పండితులు హదీసులను లక్ష వరకు వ్రాసియుంచగా నేడు వాటిని గ్రంథరూపముగా చేసిన వారు అందులో ముఖ్యమైన వాటిని దాదాపు వెయ్యి వరకు తీసుకొని హదీసు గ్రంథములు చేసినట్లు, అదే విధముగా లక్ష వ్యాసములుగా యున్న వాటిలో ముఖ్యమైన వాటిని తీసుకొని దాదాపు 1108 వరకు వ్రాసి నాలుగు వేదములను చేశారు. వ్యాసములను చిన్నవయస్సు నుండి పరిశీలించిన వ్యాసుడు వ్యాసములను బట్టి అవే గొప్పవని తలచి వాటి పేరునే తన పేరుగా యుండవలెనని యుక్తవయస్సు లోనే తన పేరును వేదవ్యాసుడు అని పెట్టుకోవడము జరిగినది. తన తల్లి తండ్రులు పెట్టిన పేరును 25 సంవత్సరములలోనే వదలివేసిన వాడు, వేద వ్యాసముల వలన ప్రేరేపితుడై తన పేరును వేదవ్యాసుడుగా మార్చుకొన్నాడు.

ఈ రోజు నేను చెప్పు విషయము అందరికీ క్రొత్తగా ఆశ్చర్యముగా యున్నా ఆ రోజు జరిగిన సత్యము అదే. కృతయుగము నుండి కొంత ఆధ్యాత్మిక ప్రేరణ కల్గినవారు వారికి తెలిసినది వారు వ్రాసిపెట్టారు. ఆనాడు తాటి ఆకుల మీద వ్రాసినవి ఎంతోకాలముగా యుండి శిథిలావస్థకు రాగా, వాటన్నిటిని చదివిన వ్యక్తి ఒకే ఒక వ్యాసుడు. వ్యాసుడు అంతవరకు విడివిడిగా యున్న అనేకుల వ్యాసములను ఒకటిగా చేర్చి గ్రంథములుగా వ్రాయాలని అనుకొన్నాడు. అయితే వ్యాసుడు అందరు వ్రాసిన వ్యాసములను ఉన్నవి ఉన్నట్లు వ్రాయలేదు. అందులో తన స్వార్థము పని చేసి వ్యాసమును రెండు భాగములుగా చేసి, వ్రాసిన వారి పేరుగల చివరి భాగమును ఉపనిషత్‌యని పేరుపెట్టి విభజించాడు. మొదటి భాగమును వేదము

అని, చివరిలో వ్రాసినవారి పేరున్న భాగమును ఉపనిషత్‌యని చెప్పాడు. చివరి భాగములో వ్యాసము వ్రాసిన వారి పేరు ఉండగా, పేరున్న చివరి భాగము ఉపనిషత్ అయినది. అందువలన ప్రతి ఉపనిషత్ ఏదో ఒక పేరు మీద ఉండును. ప్రతి ఉపనిషత్ ఒక పేరును కల్గియుండును. ఉపనిషత్ ఏ పేరుతో యుండునో ఆ పేరున్న వ్యక్తి ఆ వ్యాసమును వ్రాశాడు అని అర్థము. అయితే వ్యాసము రెండు భాగములుగా విభజించబడి యుండుట వలన మొదటి భాగమును వ్రాసిన వారి పేరు తెలియకుండా పోయినది. ఉపనిషత్‌ల పేర్లు ఉండుట వలన వాటిని ఫలానా వారు వ్రాశారని చెప్పవచ్చును. ఇలా దాదాపు 1108 ఉపనిషత్తులు వ్యాసుని చేత వ్రాయబడినవని చెప్పుచుందురు.

ఉదాహరణకు 'మండుకోపనిషత్'ను దానికున్న పేరునుబట్టి మండూకడు ముని వ్రాశాడని చెప్పుచుందురు. తైత్తరీయోపనిషత్‌ను తైత్తరీయ ముని వ్రాశాడని చెప్పుచుందురు. కేశోపనిషత్‌ను కేశవుడు అను పండితుడు వ్రాశాడు అని చెప్పుచుందురు. ఈ విధముగా ఉపనిషత్‌లను ఆయా పేర్లమీద వ్రాసిన వ్యాసుడు, వాటి ముందర వ్యాసములను తానే వ్రాసినట్లుండవలెనని, వేదములను ఆ వ్యాసములను తానే వ్రాసినట్లు అందరూ అనుకోవాలను ఉద్దేశ్యముతో వ్యాసములను నాల్గువేదములుగా విభజించి నాల్గు గ్రంథములు వ్రాశాడు. ద్వాపరయుగములోనే ఇతర మహర్షులు వేదములని పేరుపెట్టి వ్రాసిన గ్రంథములు ఎవరు వ్రాశారు? అని ప్రశ్నించగా, తాను వ్రాశానని అంటే తన తప్పు దొరికిపోవునని తెలివిగా బ్రహ్మ ముఖము నుండి వచ్చినవి అని చెప్పాడు. బ్రహ్మముఖము నుండి వచ్చిన వ్రాతలు శిథిలావస్థలో తాటి ఆకుల మీద ఉండగా, వాటిని గ్రంథరూపము చేయుచున్నానని చెప్పాడు. ఆనాడు అప్పటినుండి కొందరు

వేదములు బ్రహ్మముఖము నుండి వచ్చినవనీ, మనుషులు వ్రాసినవి కాదుయని చెప్పడము జరిగినది. అందరూ అదే నిజమని అనుకొన్నారు.

ఎలాగయితేనేమి వేదములను పేరుతో ఇతరుల వ్యాసము వ్రాసిన వానిపేరు వేదవ్యాసుడని స్థిరస్థాయిగా నిలచిపోయినది. అయితే వ్యాసుడు చరిత్రలో వ్యాసములు వ్రాసిన వారందరికీ మోసము చేసి తాను స్వయముగా వ్రాసినట్లు వ్యాసములను వ్రాసి, వ్యాస చివరి భాగములను అనగా వ్రాసిన పేరున్న భాగములను తోకలు కత్తిరించినట్లు కత్తిరించి ఒకచోట చేర్చి ఉపనిషత్తులు అని అన్నాడు. వేదములలోనే ఉపనిషత్తులను పెట్టినా, వ్రాసిన వానికి సంబంధము లేకుండా వ్యాసములను కత్తిరించి తన ఖాతాలో తానే వ్రాసినట్లు ప్రచారము చేసుకొని, చివరికి వేదవ్యాసుడుగా మిగిలిపోయాడు. ఇతరుల వ్యాసములను వేదములుగా మార్చి వేదవ్యాసుడని పేరు తెచ్చు కొన్నాడు. అంతటితో ఊరక ఉండక పురాణములను కూడా వ్రాశాడు. నాలుగు వేదములు వేలమంది వ్రాసినవని చెప్పుటకు గుర్తుగా వేయి ఉప నిషత్తులుండడమే కారణము. వెయ్యికంటే మించి లక్ష వరకు యున్న వేద వ్యాసముల నుండి కొన్నింటినే తీసుకొని, నాలుగు వేదములను చేసిన వ్యాసుడు తర్వాత 18 పురాణములను వ్రాశాడు. అప్పటికీ తాను వ్రాసిన వేదములే నిజమైన దైవజ్ఞానము అని అనుకొని మురిసి పోయేవాడు. ప్రపంచమునకంతటికీ తాను వ్రాసిన వేదముల వలననే దైవభక్తి, ఆధ్యాత్మికత ఏర్పడునని అనుకొన్నాడు. అయితే ఆయన అనుకొన్నది ఆయన ముందరే కనిపించకుండా పోయింది. తాను అనుకొన్నది తప్పని, తాను పొరపాటు పడ్డానని తర్వాత తెలుసుకోగలిగి దిగులు చెందిపోయాడు.

వ్యాసుడు వేదములు వ్రాసి, ఆధ్యాత్మికమునకు అవే ప్రామాణిక గ్రంథములని చెప్పగా, అప్పటినుండి అందరూ వాటినే విశ్వసించసాగారు.

అంతకుముందే పాటల రూపములో, మంత్రరూపములో కొందరివద్దనే కొనసాగుతూ వచ్చుచున్న వేదములు గ్రంథరూపములుగా ప్రజల అందరి వద్దకు పోయాయి. అప్పుడు భూమిమీద అధర్మములు ఎక్కువయినాయని తలచిన దేవుడు భగవంతునిగా అవతరించి వేదములకు వ్యతిరేఖముగా జ్ఞానమును భగవద్గీత రూపములో చెప్పాడు. అప్పుడు దానిని తెలిసిన వ్యాసుడు పూర్తిగా చింతించి, తాను చేసిన పని తప్పని తెలిసి దానికి పాశ్చాత్తాపముగా, పాపపరిహారముగా భగవద్గీతను గ్రంథరూపము చేశాడు.

ఈ విధముగా ఎంతో జరిగిన చరిత్రయుండగా, వాటినన్నిటినీ తెలియకుండానే ఇతరులను ప్రశ్నించడము మంచిది కాదు. ఈ ప్రశ్నలు అడిగినవారు హిందూ మత రక్షకులమని చెప్పుకొనువారు ప్రశ్నించినదే యని తెలియుచున్నది. నేను ఉన్నది ఉన్నట్లు చెప్పుచున్నాను. వీరు వాస్తవముగా తమ మతమును ఉద్ధరించవలెననిగానీ, మతమును పెరుగునట్లు చేయవలెననిగానీ అంతరంగములో లేదు. సమాజములో గుర్తింపు వచ్చుటకు ఇదంతా చేయుచున్నారు. సమాజములో గుర్తింపు వస్తే మతము మీద, మతములోని మనుషుల మీద తమ పెత్తనమును సాగించుటకేయని నా అనుభవముతో చెప్పుచున్నాను. నిజముగా హిందూ మతమును రక్షించు వారికయితే వానికి హిందూ మత ధర్మములు తెలిసియుండాలి. అవి ఏవో వారికి తెలియవు. కనీసము హిందూ ధర్మములకు ప్రామాణిక గ్రంథమయిన భగవద్గీతనయినా చదివియుండాలి. అదియూ చదివియుండరు. హిందువుల కొరకు, హిందూమతము కొరకు శ్రమ పడాలనుకొన్న వారికి భగవద్గీత తెలియదు, హిందూ ధర్మములు తెలియవు. అటువంటివారు హిందూ మతము కొరకు శ్రమపడినట్లు నటించుచుందురు తప్ప నిజముగా వారిలో ఉద్దేశ్యము అది కానేకాదు.

హిందువులలో తాము పెద్దలము అన్నట్లు గుర్తింపు వస్తే మేము హిందూ మత పెద్దలమని చెప్పుకొనుచూ హిందువుల మీద పెత్తనము చెలాయించు ఉద్దేశ్యము తప్ప ఇతరము ఏమీ లేదు.

ఏ మతమును రక్షించుకోవాలన్నా కనీసము ఆ మత ప్రాథమిక జ్ఞానము కొంచెమయినా తెలిసియుండాలి. సాధారణ జ్ఞానముగానీ, ప్రాథమిక జ్ఞానముగానీ తెలియనివారు నేడు మత రక్షకులుగా ఉండడము వలన, వారు మతమును ఏ విధముగా రక్షించగలరు? చివరకు తమ మతమేదో, పరాయి మతమేదో గుర్తించలేనివారు కూడా మతరక్షకులవలె బజారులోనికి వచ్చి, తమ మతమునే పరమతముగా తలచి, తమ మతము వారిమీదనే దాడిచేయువారు హిందూ మతమును కాపాడు సభ్యులా? భగవద్గీతను బోధిస్తూ అందులో రాజవిద్యా రాజగుహ్య యోగమున 23వ శ్లోకమును చదివి దాని వివరము చెప్పుకొను హిందువుల గుంపును చూచి అక్కడేదో పరమత బోధ జరుగుచున్నదని తలచి అక్కడికిపోగా, అక్కడ అన్యదేవతలను ఎవరు శ్రద్ధతో పూజించునో వారు మార్గము తప్పినవారు అని, ఇతర దేవతలను పూజించువారు దైవమార్గమును వదలి నడచిన వారగును యని ఆ శ్లోకమునకు వివరము చెప్పుచుండగా, అక్కడికి పోయిన హిందూ రక్షకులు వారితో ఘర్షణకు దిగారు. మీరు పరమతమును బోధించుచున్నారు. హిందూమతములో ప్రతి చిన్న దేవతతో సహా, పెద్ద దేవత వరకు పూజించడము ఆనవాయితీగా ఉండగా ఇతర దేవతలను ఎవరినీ మ్రొక్కకూడదని చెప్పుచున్నారు అంటే మీరు బహుశా క్రైస్థవ మతమునకు చెందినవారై యుంటారు. అందువలన అన్యదేవతారాధన చేయకూడదని అంటున్నారని వాదమునకు దిగినారు. అప్పుడు వారి మధ్య జరిగిన సంభాషణ వింటే హిందూ మత రక్షకులు ఎలా ఉన్నారో తెలియగలదు చూడండి.

**హిందూ బోధకులు :-** మీరు అనుకొన్నట్లు మేము పరాయి మతము వారము కాదు. మేము నిజమైన హిందువులము. మీరు భగవద్గీత చూడండి. భగవద్గీతలో చెప్పినదే మేము చెప్పుచున్నాము. రాజవిద్యా రాజగుహ్య యోగములో 23వ శ్లోకములో **"అన్యదేవతారాధన వలన దేవుని మార్గము తప్పినవారగుదురని"** చెప్పారు ఒకమారు చూడండి.

**హిందూ మత రక్షకులు :-** మేము భగవద్గీత చదివాము. అందులో ఏమున్నదీ తెలుసు. సర్వదేవతలను పూజించమని గీతలో చెప్పారు, పూజించ వద్దని ఎక్కడా చెప్పలేదు. హిందూ మతము సకల దేవతలకు నిలయము. మాకు తెలియదంటావా? మీరు దేవతల పూజలను ఖండించుచున్నారంటే ఇది అన్యమత బోధే. మీరు ఇక్కడినుండి పోకపోతే మీ కాళ్లు విరగగొట్టుతాము.

**హిందూ బోధకులు :-** హిందూ దేశములో, హిందువుల మధ్య భగవద్గీతను చెప్పుకొనుట కూడా తప్పేనా? మేము హిందువులము, భగవద్గీతలోని సమాచారము చెప్పుకోకూడదా?

**హిందూ మత రక్షకులు :-** మీరు చెప్పుకొనునది భగవద్గీత కాదు. భగవద్గీత ముసుగులో బైబిలును చెప్పుచున్నారు. బైబిలులో అన్యదేవతారాధన చేయకూడదని కలదు. క్రైస్థవులు ఎక్కడ చూచినా అదే చెప్పుచున్నారు. అదే విషయమునే చెప్పుచున్న మీరు మమ్ములను చూచి భగవద్గీతయని అంటున్నారు.

**హిందూ బోధకులు :-** చూడండి, ఇది భగవద్గీత. మీ కన్నులకు వేరే గ్రంథముగా కనిపించుచున్నదా! (అని భగవద్గీతను వారికి చూపడము జరిగినది. అయినా వారు మాటమాటకు కోపమును ప్రదర్శిస్తూ ఒకరికొకరు

గుంపులవుతూ, మొదటయున్న పదిమందికి ఇంకా కొందరు చేరి దాదాపు యాభై మందిదాకా జమ అయినారు.)

**హిందూ మత రక్షకులు :-** ఇది భగవద్గీతనా! కృష్ణుడు అర్జునుడు ఉండేచోట ఎవరో ముసలివారున్నట్లు, గడ్డము పెరిగినవారు ఉన్నారు కదా! గడ్డము పెట్టుకొని బోధించే ఆయన ఏసే అయి ఉంటాడు. ఆయన ఏసే కదా!

**హిందూ బోధకులు :-** గడ్డమున్న ఆయన కృష్ణుడు. కృష్ణుడు 90 సంవత్సరముల వయస్సులో భగవద్గీతను బోధించాడు. అందుకే గడ్డము కలదు. ఆయన తలమీద కిరీటము కూడా ఉంది కదా! వృద్ధాప్యములో బోధించాడను గుర్తుకు అలా బొమ్మను చిత్రించాము. అది ఏమీ వింతకాదు కదా!

**హిందూ రక్షకులు :-** మేము బైబిలును, ఏసు బొమ్మను కనుక్కోలేమా! ఇది ముమ్మాటికీ ఏసు బొమ్మే. పైగా భగవద్గీత మీద త్రైత సిద్ధాంత భగవద్గీత యని ఉన్నది. త్రైత అనినా, త్రిత్వ అనినా రెండూ ఒక్కటే. త్రిత్వము క్రైస్థవుల నినాదము. ఇదంతా క్రైస్థవము పైకి కనిపిస్తావుంది. పైగా దేవతల ఆరాధన చేయకూడదని చెప్పుచున్నారు. మీరు బోధిస్తే మేము ఒప్పుకోము. ఇక్కడినుండి పోవలసిందే.

**హిందూ బోధకులు :- 'త్రైత సిద్ధాంతము'** అనునది హిందూమతములో అద్వైత, ద్వైత సిద్దాంతములవలె ఒక సిద్ధాంతము. ఇది మూడవ సిద్ధాంతము అయినందున 'త్రైత సిద్ధాంతము' అని అన్నాము. ఈ భగవద్గీతను మేము ఒక్కరే కాదు దేశములో అనేకులు చదువుచున్నారు. అన్నిటికంటే మంచి వివరమును ఇచ్చినది కావున దీనినే ఎక్కువమంది అనుసరించుచున్నారు. (ఈ విధముగా ఎంత చెప్పినా అక్కడ గుమికూడిన హిందూ రక్షకులు

ఏమాత్రము వినకుండా దురుసుగా ప్రవర్తించుటకు ప్రయత్నించుచుండగా చివరిగా హిందూ బోధకులు ఇలా అన్నారు.)

"మేము ఎంత చెప్పినా మా మాటలను గ్రహించకుండా, మేము హిందువులమైయుండి హిందూ బోధలను చెప్పుచున్నా, సాక్ష్యాత్తూ భగవద్గీతనే చెప్పుచున్నా, మమ్ములను హిందువులు కాదనడము పరాయి మతము వారనడము, మా భగవద్గీతను బైబిలుగా చెప్పడము, క్రిష్ణునికి గడ్డముంటే ఏసుయని చెప్పడము, ఇదంతా ఏమీ బాగాలేదు. మీరు హిందువులే మేము హిందువులమే అయినా, మీ చేత మేము దొంగలవలె చిత్రించ బడినాము. మీరు మాటిమాటికీ మమ్ములను క్రైస్థవులనడము మంచి పనికాదు. మీలో ఒక్కడు కూడా జ్ఞానము తెలిసిన పెద్దలు లేరు. అంతా చిన్నవయస్సు వారు మీకు ఏమీ తెలియదు. మీ పెద్దలను రమ్మనండి మాట్లాడుతాము.

(అప్పుడు వారిలో ఒకడు "మా పెద్దలు చెప్పియుంటేనే మేము ఇక్కడికి వచ్చాము" అని అన్నాడు. అప్పుడు హిందూ బోధకులుగా యున్న వారికి ఇదేదో ముందునుంచి వేసుకొన్న పథకము ప్రకారము వీరు వచ్చారని తెలిసి చివరిగా వీరితో ఏమీ మాట్లాడకూడదని తలచి అక్కడి నుండి పోవడము జరిగినది.)

అక్కడ జరిగిన సంఘటనలో అంతా కుర్రకారు మగపిల్లలు వచ్చి మాట్లాడడము, వారి వెనుక కొందరు పెద్దలు ఉండి వారిని పంపడము జరిగినది. జరిగిన సంఘటనకు కొంత బాధపడిన హిందూ బోధకులు ఒక ప్రెస్‌క్లబ్‌లోనికి పోయి ఈ విషయమును విలేఖరులకందరికీ తెలియులాగా అందరినీ సమావేశపరచి, నిన్నటి దినమున జరిగిన

విషయమునంతా చెప్పి, “ఈ మధ్యకాలములో హిందూ మత రక్షణ సంస్థల ఆగడాలు ఎక్కువయి పోయాయి. మేము భగవద్గీతను చెప్పుకొంటున్నా మా దగ్గరికి వచ్చి, మీరు పరమత బోధలు చెప్పుచున్నారని ఆరోపించి మాతో ఘర్షణకు దిగారు. ఈ విధముగా హిందువులే హిందువులను గుర్తించలేక మా మీద దాడులు చేయుటకు పూనుకొన్నప్పుడు మేము హిందువులై, హిందూమతములో ఉండలేకపోవుచున్నాము. హిందూ మత రక్షణయను పేరు పెట్టుకొన్న పిల్లవాడు కూడా మమ్ములను ఎదురించి మాట్లాడుచున్నాడు. వారికి హిందూ ధర్మములను గురించిగానీ, హిందూ జ్ఞానము గురించిగానీ తెలియకున్నా మమ్ములను క్రైస్థవులుగా చిత్రించి మాట్లాడినారు. ఇది తెలియక చేసిన పొరపాటు కాదు. అదే పనిగా తెలిసి చేసినదిగా మాకు అర్థమగుచున్నది. ఇలాగే మమ్ములను కించపరచి మాట్లాడితే మేము హిందూమతములో హిందువులుగా ఉండలేము. మేము ఇతర మతములోనికి పోక తప్పదు. ఇంతటితో ఇటువంటి సంఘటనలు జరుగవు అని హిందూ రక్షకులు హామీ ఇస్తే మేము ఇలాగే హిందువులుగా ఉంటాము. కాకపోతే మేము, మా అభిమానులు, అనుచరులు, మా త్రైత సిద్ధాంత జ్ఞానమును తెలిసినవారు మొత్తము ప్రస్తుతము పదివేల మంది ఇతర మతములోనికి పోవలసి వస్తుంది. ఇప్పుడు హిందూ రక్షణ సంస్థలు మాకు ఇచ్చే హామీని బట్టి యుంటుంది” అని ప్రెస్ మీటింగ్‌లో చెప్పడము జరిగినది. అలా మీడియా ద్వారా న్యూస్ పేపర్‌లో ప్రకటించగా రెండవ రోజు దానికి సంబంధించిన దానికి మరొక న్యూస్‌పేపర్‌లో జవాబు రావడము జరిగినది. అది ఇలా ఉంది.

“మీరు హిందువులుగా యుండి హిందూ ముసుగులో పరమతము లను ప్రచారము చేయుచున్నారు. అటువంటి వారు మా హిందూమతములో

ఉండకూడదు. మీరు హిందూమతములో ఉండి హిందూ మతమునకు నష్టము తెస్తున్నారు. మీరు మా మతమును వదలిపోండి. మా మతములో లేకుండా మీరు ఏ మతములోనికి పోయినా మాకు నష్టము లేదు" అని వ్రాశారు. ఆ వార్తను చూచిన హిందూ బోధకులయిన వారు ఇతర మతములోనికి ఒక్కరు కూడా పోలేదు. అలా ఇతర మతములోనికి పోతే హిందూమతము ఒక్కమారుగా పదివేల మందిని కోల్పోతుంది. ముఖ్యమైన గురువులే మతమును వదలిపోతే వారి అనుచరులు ఎన్నో ప్రాంతములలో ఎందరో ఉందురు కదా! వారు కూడా మా గురువు లేని మతము మాకు వద్దు అని హిందూమతమును వదలే అవకాశమున్నది. అట్లు అందరూ మారితే తర్వాత వారి సంఖ్య లక్ష వరకు అగును. ఇంతవరకు క్రైస్థవులు, ఒక ప్రక్క ముస్లీమ్‌లు, ఒకప్రక్క హిందువులను చేపల చెరువులో చేపలను పట్టినట్లు తమవైపు లాగుకొన్నారు. హిందువుల నుండి మతమార్పిడి జరిగిన వారిలో 80 శాతము క్రైస్థవులలోనికి, 20 శాతము ముస్లీమ్‌లలోనికి మారిపోయారు. అలా మారిపోవడానికి ఇతర మతముల వారి ప్రచారమే కారణము కాదు. మొట్టమొదటిది స్వమతములోని కుల వివక్షే కారణము.

హిందూమతములో అగ్రకులముల వారి కుల వివక్ష వలన చాలామంది ఇతర మతములోనికి మారిపోయారు. అటువంటి వారు నూటికి అరవైమంది గలరు. 60 శాతము కుల వివక్ష చేత మారినవారు, జ్ఞానము కొరకు మారినవారు దాదాపు 10 శాతము గలరు. లాభము కొరకు మారినవారు 30 శాతము గలరు. ఎవరు ఎట్లు మారినా మతమును రక్షించాలను ఉద్దేశ్యములో మతరక్షణ సంఘములు పెట్టినవారే, మత మార్పిడికి ముఖ్య కారకులుగా యున్నారు. మతరక్షణ సంఘములలో పైన యున్న కీలక వ్యక్తులు అగ్రకులమునకు సంబంధించిన వారే

యుందురు. వారు సంఘములో తమ క్రింద పనిచేయు వారికి మత రక్షణను గురించి, మతమును కాపాడు విధానమును గురించి గొప్పగా చెప్పుచుందురు. ఎక్కడయినా మత మార్పిడి జరుగుచున్నదని తెలిస్తే మన ప్రాణములను అడ్డువేసి అయినా దానిని అడ్డుకోవాలియనీ, మత మార్పిడి చేయువారిని ఊరక వదలకూడదనీ, మతము కొరకు ఎక్కువగా ప్రాకులాడవలెననీ, అలా ప్రాకులాడితే అదే దేశభక్తియనీ చెప్పి తమ సంఘములో యున్నవారు తాము ఏమి చెప్పితే దానిని ఆచరించునట్లు తయారు చేయుదురు. ఎక్కడయితే తమ కులము కానివారు జ్ఞానబోధలు చేయుచుందురో వారిని పైకి రానీయకూడదని తలచి, వారిని పరమత బోధకులుగా చిత్రించి చూపుదురు. వారు హిందూమతములో హిందువులుగా యుండి హిందూ జ్ఞానమునే చెప్పుచున్నా, అటువంటి వారు తమకు పోటీగా ఉందురనీ, తాముతప్ప ఎవరూ గురువులుగా ఉండకూడదనీ, హిందూమతములో తమ పెత్తనము తప్ప ఇతర కులస్థుల పెత్తనము ఉండకూడదని తలచిన వారై, పైకి హిందూమతమును రక్షింతుమని చెప్పుచూ తమ క్రింద పనిచేయు వారిని తమ మతము వారి పైకే ఉసికొల్పి, పరమత ప్రచారము చేయుచున్నారు అని అబద్ధపు ఆరోపణ చేసి, వారిమీదికి పురికొల్పి పంపగా ముందు వెనుక ఆలోచన చేయని సంఘములో పని చేయు సభ్యులు బాణములాగా ముందుకు పోవుదురు. అలా పోవు వారికి వాస్తవముగా హిందూ ధర్మములు ఏమాత్రము తెలిసియుండవు. సంఘ పెద్దలు ధర్మముల గురించి తెలియకుండా చేసియుందురు. వారి చూపును హిందూ ధర్మముల మీదికిగానీ, హిందూ జ్ఞానము మీదికిగానీ పోకుండా దేశభక్తి వైపు త్రిప్పి యుందురు. మతభక్తిగానీ, మత జ్ఞానముగానీ ఏమాత్రము తెలియకుండా చేసి దేశ భక్తిని నేర్పియుందురు. అట్లు తయారయిన కార్యకర్తలకు కొద్దిగా

కూడా హిందూ జ్ఞానము తెలియకపోవడము చేత తమ పెద్దలు ఎవరిని చూపితే వారిమీదికి దాడి చేయుటకు పోవుచుందురు. అలా వారు చేసే దాడులలో పదింటికి ఒకటి పరమతముల మీద ఉండగా తొమ్మిది స్వమతము వారిమీదనే యుండును. ఇదంతా మేము అసూయతో చెప్పడము లేదు. స్వంత అనుభవముతో చెప్పుచున్నాము.

ఏమాత్రము హిందూ జ్ఞానముగానీ, హిందూ ధర్మములుగానీ తెలియని హిందూ రక్షణ కార్యకర్తలు వీరు తమవారా, పరాయివారా యని గమనించకుండా ఏమి చెప్పినా అర్థము చేసుకోకుండా ప్రవర్తింతురు. భగవద్గీతను చూపితే అది భగవద్గీతయని కూడా తెలియని స్థితిలో వారు తయారయి వుందురు. జ్ఞానమును చెప్పితే అది తమ జ్ఞానమేయని తెలియని స్థితిలో ఉందురు. వచ్చిన వారికి దేశభక్తి రాజకీయము తప్ప హిందూ జ్ఞానము ఏమాత్రము తెలియదు. చివరకు తమ హిందువుల మీదనే తాము దాడిచేయడము జరుగుచున్నది. అలా జరిగిన తర్వాత బాధకు గురియైన హిందువులు, గురువులుగా యుండి బోధించుకోవడము మానివేయనయినా మానివేయాలి, లేకపోతే ఈ మతములో రక్షణ లేదని ఇంకొక మతము లోనికయినా పోవాలి. పదివేలమంది ఒక్కమారు ఇతర మతములోనికి పోతారని తెలిసినా, తర్వాత వారిని అనుసరించువారు దాదాపు లక్ష వరకు వారి వెంట పోతారని తెలిసినా, మీరు మా మతములో ఉండద్దండి అని ఎప్పుడయితే అన్నారో, అప్పుడు హిందూ మతమును రక్షించటానికి వారు లేరని, పైకి మాత్రము హిందూ రక్షకులను పేరు పెట్టుకున్నా వారు తమ అదిపత్యమును కాపాడుకొనుటకు ముఖ్యముగా బోధకులుగా యున్న వారిని, కొందరికి గురువుగా యున్న వారిని, మతములో లేకుండా చేస్తే తమకు ఎవరూ ఎదురుండరనే భావము వారికున్నదని అర్థమయినది. ఈ విధముగా

వారు పూర్వము బుద్ధుని కాలములో కూడా చేశారు. ఆ రోజు హిందూమతము ఒక్కమారుగా చీలిపోయి 'బౌద్ధమతము' అను పేరు వచ్చినది. ఆనాడు కేవలము అగ్రకులము వారి కుట్రతోనే బుద్ధున్ని ఎంతగా ఇబ్బంది పెట్టినా ఆయన హిందూ మతములోనే ఉండగా ఆయన మతము వదలిపోకున్నా, కొందరు అగ్రనాయకులుగా చలామణి అగువారే బుద్ధున్ని పరాయి మతమువాడని, ఆయన పరాయి మతమును స్థాపించాడని హిందువులే బుద్ధునిది బౌద్ధమతమని పేరుపెట్టి ఆయనను బయటికి సాగనంపారు. అప్పటి నుండి వారిని వేరు మతమని చెప్పుచున్నారు. వారిది వేరు మతమని చెప్పినా, నేటికీ వారు హిందువులున్నట్లే కాషాయమును ధరించి, తలలు బోడులు చేసుకొని బ్రహ్మచారులుగా పవిత్ర జీవితమును గడుపుచూ హిందూ సాంప్రదాయము ప్రకారమే యున్నారు. వారు చీలిపోకున్నా ఆనాడు హిందువులే వారిది ఫలానా మతమని పేరు పెట్టారు. వారివలెనే రూపురేఖలలో ఒకే విధముగా యున్న ఆది శంకరా చార్యుల వారిని తెచ్చి వారివలె కాషాయము, వారివలె తల బోడి చేయించి వారికి పోటీయని అన్నట్లు దేశమంతా తిప్పారు. ఇలా ఎవరూ గుర్తించలేని అరాచకాలు హిందూమతములో జరుగుచూ వచ్చాయి. నేడు కూడా జరుగుచున్నాయి. తాము ఏమాత్రము బయటపడకుండా చక్రము త్రిప్పుచూ, మిగతా కులముల వారిలో కొందరిని తమ మాట వినువారిగా తయారు చేసి పెట్టుకొని, మిగతా కులముల వారి చేతనే వారి తతంగమంతా నడుపు చున్నారు. ఇది ఈనాడు అమలు చేయుచున్న సరిక్రొత్త ఫతకము. మా మాటలు కొందరికి మేము అసూయతో చెప్పినట్లు కనపడుచుండును. మీరు కొంత బుద్ధిని సారించి చూస్తే మేము చెప్పు మాటలు నూటికి నూరు పాళ్లు సత్యమని తెలియును.

బుద్ధుడు ఆ రోజు ప్రత్యేకమైన ద్యానమును బోధించాడు తప్ప మతమును బోధించలేదు. ప్రత్యేక ద్యానమును సాకుగా చూపి హిందువులే బుద్ధునిది వేరే మతమని చీల్చివేశారు. ఆ రోజు దేవతలను పూజించకుండా ద్యానము చేయమని చెప్పడము తప్పులేదు కదా! భగవద్గీతలో కూడా అన్యదేవతారాధన తప్పని చెప్పలేదా! తామే తప్పు చేస్తూ అన్యదేవతలను పూజించువారు, భగవద్గీత ప్రకారము తమది తప్పని అనుకోకుండా అన్యదేవతారాధన చేయవద్దని, దానికి బదులు ద్యానము చేయమని చెప్పిన వారిదే తప్పుగా చూపి వారు హిందువులు కాదని వెలివేశారు. బౌద్ధమతము హిందువులు వెలివేయగా బయటపడినది. హిందువులు బుద్ధుని ద్యానమును, ఆధ్యాత్మికతను వ్యతిరేఖించి ఆయనను హిందువులే బౌద్ధమతమని పేరుపెట్టి వెలివేశారు. దీనిని కాదనుటకు వీలులేదు. ఆనాడు జరిగిన సత్యమదే. బుద్ధున్ని బౌద్ధమతమను పేరుపెట్టి వెలివేయడమేకాక ఆయనకు వ్యతిరేఖముగా ఆదిశంకరున్ని తెచ్చి, దేశము నలుమూలలా నలుగురు దేవతలను స్థాపించి తమది తప్పులేనట్లు ప్రవర్తించారు. ఆది శంకరాచార్యులను అటూ ఇటూ త్రిప్పుచూ బుద్ధుని విషయముతో తాము తప్పు చేసినట్లు గుర్తించకుండా అందరి దృష్ఠిని ప్రక్కకు మరల్చారు.

ఆ రోజులలో ఎలా చేసి తెలివిగా ప్రవర్తించి బుద్ధున్ని చిన్న సాకు చూపి ఎలా బయటకు పంపారో, నేడు కూడా అటువంటి ప్రయత్నమే చేయుచున్నారని చెప్పక తప్పదు. బుద్ధున్ని బయటికి పంపిన తర్వాత ఆది శంకరాచార్యులను బొమ్మను చేసి భారతదేశమంతా త్రిప్పి, బుద్ధున్ని గురించి ఆయనకు జరిగిన అన్యాయమును గురించి ఎవరూ ఆలోచించకుండా చేశారు. అయితే నేడు కూడా భవిష్యత్తులో తమకు హిందూమతములో ఆటంకముగా తయారగుదురేమోయని అనుమానముతో బుద్ధుని

'ద్యానము'ను తప్పుగా చూపినట్లు ఇప్పుడు కూడా లేని తప్పును వెదకి దానినే పెద్దగా చూపి దాదాపు లక్షమంది దాకా ప్రాకిపోయిన జ్ఞానమును చూచి భయపడి, ఓర్వలేక తప్పుకాని తప్పును సృష్ఠించి లక్షమందిని హిందూ మతము నుండి బయటకు పంపు ప్రయత్నము చేయుచున్నారు. తమకు సరిపోని జ్ఞానము వారివద్ద యున్నందున, భగవద్గీత సూత్రములనే వారు ఆచరించుచుండుట వలన వారిని బయటికి పంపి హిందూమతములో ఎదురులేని వారిగా ఉండవలెనను ఆలోచన నేడు హిందూ రక్షణ అని పేరు గల సంస్థల పెద్దలవద్ద కలదని తెలియుచున్నది. బుద్ధుడు అన్య దేవతారాధన వద్దు ద్యానము చేయమని చెప్పాడు. అది ఆనాటి తప్పు నేటి తప్పు ఏమనగా!

దాదాపు 150 సంవత్సరముల క్రితము వరకు అచ్చు ఇ తో చెప్పబడు ఇందూదేశము, ఇందూ మతము అను పేరుతో ఉండేది. కాలక్రమమున అది కాస్త మార్పు చెంది హిందూదేశము, హిందూ మతము అని చెప్పుటకు అలవాటు పడినారు. అయితే పలికే ప్రతి శబ్దమునకు ఒక అర్థముండి తీరాలి. అర్థము లేని మాట వ్యర్థము. నేడు అదే విధముగా ఎట్లు వెదకినా హిందూ అను పదమునకు అర్థము లేదు. అదే విషయమునే బయటికి చెప్పి మనది హిందూ మతము కాదు, ఇందూ అను పదము మనది. హిందూ అను పదము ఇతర మతము వారు అదే పనిగా అతికించారు. ఇతర భాషలో ఘోరమైన దూషణ పదము. తెలుగు భాషలో ఏ అర్థము లేని పదము. ఇతర దేశ భాషలో దొంగ, వ్యభిచారి అని అర్థము వచ్చునట్లు హిందూ పదమును 150 సంవత్సరములప్పుడు మార్చివేశారు. ఆ పదమును మనము హిందూ అని పలుకుచుంటే, వారు నవ్వుకొనేవారు. నేడు కూడా మన తెలుగు భాషలో అర్థము లేని పదము. ఒక్క తెలుగు భాషలోనే కాకుండా భారతదేశమునకు సంబంధించిన ఏ

భాషలో కూడా దానికి అర్థము లేదని 2015 లో ప్రభుత్వ హోంశాఖ కార్యదర్శియే చెప్పినట్లు వార్తాపత్రికలో కూడా కలదు.

ఇదంతయూ దృష్టిలో పెట్టుకొని పూర్వము నుండి మొన్నటి వరకు మనది ఇందూ మతము అని చెప్పి 'ఇందూ'కు ఈ అర్థము కలదని చెప్పి 'ఇందూ' అని వ్రాస్తే 'హిందూ' పదము కలవారందరిదీ హిందూ మతము, "ఇందూ" పదము కలవారందరిదీ మరొక మతమని ఒక్క **"ఇ"** అను అక్షరమును పట్టుకొని లక్షమంది దాకాయున్న గుంపును హిందువుల నుండి చీల్చి ప్రక్కకు పంపేలాగ కుట్ర జరుగుచున్నదని ముందే మేము తెలియజేస్తున్నాము. ఇప్పటికే వీరు వేరే మతమును తయారు చేశారని ఆరోపణలు చేయుచున్నారు. ఏ జ్ఞానము లేనివారు, పై వారి క్రింద తొత్తులుగా పని చేయువారు మేము ఏమి చేయుచున్నాము, ఏమి మాట్లాడుచున్నాము అని కొద్దిగా కూడా ఆలోచించకుండా, ఇందూ అనేది వేరే మతమని అంటున్నారంటే కొంత ఆలోచించదగిన విషయమే. అలా అనడమే కాక మీ జ్ఞానమును బయట ప్రజలకు చెప్పవద్దండియనీ, మీ గ్రంథములను ప్రజలకు అమ్మవద్దని బెదిరిస్తున్నారంటే, వీరిని కూడా బుద్ధునిలాగ బయటకు పంపే కుట్ర జరుగుచున్నదని చెప్పక తప్పదు. ఇంతవరకు మేమూ హిందువులమే మా గ్రంథములలో కొన్నిచోట్ల హిందూ పదమునే ఉపయోగించాము. కొన్నిచోట్ల ఇందూ అని వ్రాసినా (హిందూ) అని వ్రాశాము. మేము వేరే మతమును తయారు చేయలేదు. ఉన్న మతము యొక్క చరిత్రను జ్ఞాపకము చేసి ఆ పేరు పెట్టాము అని చెప్పినా వినని పరిస్థితిలో యున్నారంటే ఇదేదో పై నుండి వెనుక కుట్ర జరుగుచున్నదనీ, వారు ప్రక్కకు పోకున్నా నేటి హిందూ పెద్దలే ప్రక్కకు పంపేలాగున యున్నారు.

ఇప్పటికే ఇందూమతము హిందూమతముకంటే వేరయినదనీ, వారు దేవతలను పూజించరనీ ప్రచారము జరుగుచున్నది. ఇందూ ధర్మము అని వ్రాసినవారు హిందువులు కాదు, వారు ప్రత్యేక మతమును తయారు చేశారని చాలాచోట్ల చెప్పుకోవడము జరుగుచున్నది. ఒక్క అక్షరముతో మతమునే మార్చు హిందువులు మతమును రక్షించువారా, మతమును చీల్చి భక్షించువారా? మీరే ఆలోచించండి. ఒక్క అక్షరము కూడా వేరే జాతిదో, వేరే శబ్దముదో కాదు. కేవలము ఒకే అక్షరమే ఒకటి అచ్చు, ఒకటి హల్లు. ఒకే తెలుగు భాషలో అచ్చు "ఇ" తో చెప్పినది ఒక మతము, హల్లు "హి" తో చెప్పినది మరొక మతము అంటే వింతగా లేదా! అలా చెప్పితే వింతే అయినా, నేడు హిందూమతములోని హిందూ రక్షకులని పేరు పెట్టుకొన్నవారు అదే వింతను అమలు చేసి మాట్లాడుచున్నారు. మాట్లాడువారు ముందరున్న చిన్న కులస్థులే అయినా వారి వెనుక వీరిని త్రోలేవారున్నారని మాకు తెలిసినది. ఇందూ అని చెప్పువారు అగ్రకులము వారు కారు. ఒకవేళ అగ్రకులము వారే అయివుంటే ఆ మాటనే బయటికి రాకుండా ఒకటిగానే ఉండేటట్లు చూచేవారు. వారి పెత్తనమునకు ధోకా లేదనుకొనేవారు. ఇందూ అను పదమును బయటికి తెచ్చినవారు వారికంటే తక్కువ కులమువారయిన దానివలన ఇక్కడ ఒక్క అక్షరము వద్ద సమస్య వచ్చినది.

హిందువులలో ఎందరో మేధావులున్నారు. అందరికీ ఆధ్యాత్మికము చూపులేదు. కొందరి కుల పెద్దలకే ఆధ్యాత్మిక చూపు కలదు. వారే హిందూ మత రక్షణలో పెద్దలుగాయుండి హిందూమతమును రక్షించక, చివరకు చీలిపోయేటట్లు చేయుచూ, వారే చీల్చివేయుచూ, హిందుత్వమును సర్వ విధములుగా నాశనము చేయుచున్నారు. వారికి తోడు పనీ పాటలేని

వారు, ఎక్కడా ఏ గుర్తింపు లేనివారు జమయై వారి చేష్టలను వారు చేయుచున్నారు. ఇందువుల తరపున పని చేయు భాస్కర్‌రెడ్డిని హిందువుల తరపున పనిచేయు ధీరజ్‌రెడ్డి దాడిచేసి కొట్టాడు. కొట్లాడుకొనువారు క్రింది కులస్థులే అయినా మేము అందరూ ఒకటే కదా! మాకు చిచ్చు పెట్టినవారే పై నుండి నాటకమాడిస్తున్నారు కదా!యని ఆలోచించలేదు. ఒక రెడ్డి ఇంకొక రెడ్డిని కొట్టితే పైన నవ్వుకొనేవారు హిందూ పెద్దలేయని తెలియక దేశభక్తి, మతభక్తి అని క్రింది కులమువారు మభ్యపడిపోయారు. ఇతరుల మీదికి కూడా చరిత్రలో దాడి చేయకుండా మాటలతోనే ఎంతటి వారినయినా మార్చిన జ్ఞానముగలది ఇందూమతము. చరిత్రలో శాంతిమతము ఇందూమతము అని పేరుగాంచినది. అటువంటి మతము కలియుగములో కుల రాజకీయము చేతిలో చిక్కుకొని పోయినది. అగ్రకులము చేతిలో మిగతా కులము వారందరూ చిక్కుకొన్నారు. సనాతనముగా సృష్ట్యాది నుండి వస్తున్నది ఇందూ సమాజము, ఇందూ జ్ఞానము. సృష్ట్యాదిలో చెప్పబడిన ఇందూ జ్ఞానమే సర్వ ప్రజలకు, సర్వ మతములకు ఆధారము. ఆ విషయమును మరచిపోయి నేడు అగ్రకులము వారి చేతిలో పావులుగా యుండవద్దని హిందువులకు తెల్పుచున్నాము.

## సమాప్తము

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!

## భగవద్గీతయే చదవనివాడు హిందూ రక్షకుడా?

## హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి, బలహీనపరచి హిందూసమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని, అన్ని కార్యములు చేసుకోవాలనీ ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగా యున్న హిందూ సమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమనీ ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డురాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటివారు హిందూ సమాజమునకు చీడ పురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక వారు చెప్పినట్లే వినుట వలన, హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి, ప్రజలకు ఏమాత్రము దైవజ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు **త్రైత సిద్ధాంతకర్తగా ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు** అజ్ఞాన దిశవైపు నిలిచి పోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన **క్షర, అక్షర, పురుషోత్తమ** అను ముగ్గురు పురుషుల విషయమును **త్రైత సిద్ధాంతము** అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది. దానివలన నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు. అగ్రకులముగానున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియనిజ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోషపడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞాన విషయములను చూచి ఈ జ్ఞానము వలన ప్రజలు జ్ఞానములో చైతన్యులై, జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్థవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదని ప్రచారము చేయను మొదలుపెట్టారు. అంతేకాక తాము హిందూధర్మరక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారమునకు అక్కడక్కడ అడ్డుపడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానందయోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్థవుల జ్ఞానమని హిందువుల ముసుగులో క్రైస్థవ మత ప్రచారము చేయుచున్నారని చెప్పడమేకాక,

అటువంటివారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరులు నెలకొల్పిన హిందూ (ఇందూ) జ్ఞాన వేదిక ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి, మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరు చూడండి.

**మా ప్రశ్న :-** ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలు ఉన్నారు. వారు ఎవరూ ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్తవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లూ తిరిగి క్రైస్తవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :-** మేము క్రైస్తవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది త్రైత సిద్ధాంత భగవద్గీత. అది క్రైస్తవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :-** క్రైస్తవులు తమను క్రైస్తవులుగానే చెప్పుకుంటారు. అలాగే బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్తవము, బైబిలు అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతమువారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతముపేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యము లున్నాయా?

**వారి జవాబు :-** త్రైతసిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :-** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు త్రైతసిద్ధాంతమును ప్రతిపాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువులని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :-** మీ త్రైతసిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :-** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? ప్రపంచమునకంతటికీ ఒకే భగవద్గీతయుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును

గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదని చదివిన జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించు చూయుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన ఒక్క హిందూ ధర్మమును చెప్పండి.

**వారి జవాబు :-** అవన్నీ మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :-** మొండిగా మాట్లాడవద్దండి మీరు అగ్రకులమువారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :-** కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా?

యోగీశ్వరుల వారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండ మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూ మతములో దేవుడు ఒక్కడే అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :-** మేము మతమును గురించి చెప్పలేదు. హిందూ మతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము విశ్వమునకంతటికి ఒకే దేవుడని చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, సృష్టికర్తయనీ అనేకమార్లు పేర్కొన్నారు. దేవుడు అను పదమునుగానీ, సృష్టికర్తయను పదమునుగానీ క్రైస్తవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్తవులు అంటున్నాము.

**మా ప్రశ్న :-** క్రైస్తవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్టిపుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది నుండి 'సృష్టికర్త' అను పదమును 'దేవుడు' అను పదమును హిందూ సమాజము వాడుతూనే యున్నది. మొదటినుండి హిందూసమాజములో

యున్న దేవుడు, సృష్ఠికర్త అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్ఠికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకోలేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి ఇందూ మతము అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలో గానీ ప్రత్యేకించి ఇందువులు అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :-** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. హిందువు, ఇందువు అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగు భాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుతకాలములో నరశింహులు అని పేరున్నవాడు కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని **నరసింహ** అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును **సింహము** అని అంటాము తప్ప **శింహము** అని అనము అనికూడ చెప్పుచున్నాము. 'సింహము' అంటే అర్థమున్నది గానీ, 'శింహము' అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే 'ఇందువు' అనే

దానికి అర్థమున్నదిగానీ 'హిందువు' అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి 'దృష్ఠి, జిష్ఠి' అయినట్లు 'ఇందూ' అను శబ్దము 'హిందూ' అని పలుకబడుచున్నదని చెప్పాము. ఇందూ పదము ఎందుకు వాడాలి, హిందూ పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న సత్యము మీకు తెలిసినా, మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించుచుండగా, కొందరు మాత్రము వీధి రౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించిన వారికి ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలో శ్రీకృష్ణుని గుడికయినా ఇవ్వవలెను. ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగుచున్నాము.

ఇట్లు

**ఇందూ జ్ఞానవేదిక**



# చరిత్రలో జరిగిన అన్యాయము

# హిందువులలో జరుగుచున్న యదార్థము

నాలుగువందల సంవత్సరముల క్రిందట ఆధ్యాత్మిక రంగములో మెరిసిన వజ్రము **వేమనయోగి.** ఆధ్యాత్మికమను పాలను చిలికి దైవజ్ఞానము అనే వెన్నను తీసి ఇచ్చినవాడు వేమన. వేమన తన పద్యములలో చెప్పిన ఒక్కొక్క జ్ఞాన విషయము విపులముగా వ్రాసుకొంటే ఒక్కొక్క గ్రంథము కాగలదు. వేమన స్వచ్ఛమైన తెలుగు భాషలో పద్యమును వ్రాసి చెప్పాడు. సంస్కృతము జోలికి పోలేదు. ఒక ప్రక్క పద్యములు వ్రాసి కవిగా కనిపించినా, ఒక ప్రక్క అంతు తెలియని ఆధ్యాత్మికవేత్త వేమనయోగి. అయితే ఆయన పుట్టినది రెడ్డి కులమున. చరిత్రలో మాకంటే ఎవరూ పెద్దగా ప్రశంసింపబడకూడదని గర్వములో యున్న అగ్రకులములోని కొందరు పనిగట్టుకొని వేమన యోగిని పిచ్చివానిగా జమకట్టి, అతను చెప్పింది జ్ఞానమేకాదని ప్రజలలో ప్రచారము చేశారు. పిచ్చివాని మాటలు పిచ్చివారే వింటారు అని హేళనగా మాట్లాడడము జరిగినది. అనేక కులములుగాయున్న హిందువులకు జ్ఞాన విషయములో పరిచయము లేనిదానివలన, అగ్రకులము వారు వేమన చెప్పినది జ్ఞానమే కాదనడము వలన, వేమన తన జ్ఞానమునకు తగినట్లుగా ప్రకాశింప లేకపోయాడు. తాము అగ్రకులము వారమనీ, మిగతా వారందరూ తగ్గు కులమువారనీ విభజించి, తాము చెప్పినట్లు వినవలెననీ, అట్లు వింటేనే మిగతా కులముల వారందరూ సుఖముగా బ్రతుకగలరనీ, అగ్రకులమువారు ప్రచారము చేసుకొన్నారు. అలా తమను తాము గొప్పగా ప్రకటించుకోవడమేకాక

హిందువుల ఇళ్ళలో జరుగు ప్రతి మంచి పనికీ, చెడు పనికీ, చావుకూ పుట్టుకకూ, పెళ్ళికీ పేరంటానికీ ప్రతి కార్యమునకూ తాము చెప్పునట్లు చేయాలనీ, తాము నిర్ణయించు కాలములోనే చేయాలనీ, అట్లు చేయకపోతే నష్టము, కష్టము కలుగుతుందని భయపెట్టడము వలన, భయముతో జ్ఞానము తెలియని మిగతా కులముల వారందరూ వారు చెప్పిన దానిని నమ్మడము జరిగినది. ఈ విధముగా హిందూమతములో అగ్రకులము వారు భయము అను బ్లాక్‌మెయిల్ చేసి, తగ్గ కులము వారందరినీ తమమాట వినునట్లు చేసుకొన్నారు. ఆనాటి నుండి హిందూ సమాజమును మోసము చేస్తూ ఎవరికీ హిందూ జ్ఞానమును తెలియకుండా చేసి, తాము హిందూ సమాజమును అనేక పేర్లతో దోచుకొంటూ బ్రతకడమే కాక, మిగతా కులములలో ఎవరు జ్ఞానులుగా పుట్టినా, వారిని హేళన చేయడమూ, అజ్ఞానిగా వర్ణించడమూ జరిగినది.

చరిత్రలో నాలుగు వందల సంవత్సరముల క్రితము వచ్చిన వేమనను పిచ్చివానిగా వర్ణించి, శాస్త్రము తెలియనివాడని వర్ణించారు. తర్వాత మూడు వందలయాభై సంవత్సరముల క్రిందట వచ్చిన **'పోతులూరు వీరబ్రహ్మము'**గారు గొప్ప జ్ఞానిగా తయారై, భవిష్యత్తు కాలములో జరుగు సంఘటనలను ముందే తెలియజేసి గొప్ప కాలజ్ఞానమునే వ్రాశాడు. ఆయన వ్రాసిన భవిష్యత్తు కాలక్రమమున నేటికినీ జరుగుచూనేయున్నది. అంతటి గొప్ప జ్ఞాని అయిన వీరబ్రహ్మముగారు అగ్రకులమువాడు కాకపోవుట వలన, విశ్వకర్మ (ఆచారుల) కులమున పుట్టుట వలన, అగ్రకులము వారు బ్రహ్మము గారు బ్రతికియున్న కాలములోనే, తమ ఊరిలోనికి రాకుండా, ఆయన జ్ఞానమును ప్రచారము చేయకుండా అడ్డుకొన్నారు. ఆ రోజు ఇతరులు జ్ఞానులు కాకూడదను అసూయ అను గుణముతోనూ, మేమే తెలిసిన

వారమను గర్వముతోనూ ఆ పని చేశారు. హిందూ సమాజములో ఇటువంటి వారుండుట వలన విసిగి పోయిన హిందువులు హిందూ మతమును వీడి ఇతర మతములోనికి పోవుచున్నారు. ఇందూమతములో దేవునికి గుడికి అంటరాని వారిగా ఉండలేని వారందరూ కొందరు జ్ఞానము కొరకు, కొందరు కులవివక్ష లేని స్వతంత్రము కొరకు మతమును మారజొచ్చారు. ఈ విధముగా హిందూమతములోని వారు ఇతర మతములోనికి పోవుటకు మొదటి కారకులు హిందూమతములోని అగ్రకులములవారేనని అనుమానము లేకుండా చెప్పవచ్చును.

తమ వలననే హిందువులు ఇతర మతములలోనికి పోవుచున్నారని అగ్రకులమువారికి కూడా తెలుసు. అయితే తమ తప్పును ఎవరూ గుర్తించనట్లు తాము హిందూమతమును ఉద్ధరించువారిగా, హిందూధర్మ రక్షకులుగా వర్ణించుకొని హిందూ ధర్మ భక్షకులుగా నేటికినీ సమాజములో కొనసాగుచున్నారు. వారిని హిందూ ధర్మ భక్షకులు, హిందూ ధర్మ నాశకులు అని చెప్పుటకు అనేక ఆధారములు గలవు. అటువంటి వాటిని పరిశీలించితే, హిందువులలోని మిగతా కులము వారివద్ద భగవద్గీతను బోధించు కృష్ణుడు అర్జునుడు యున్న చిత్రపటము (ఫోటో) యుంటే దానిని ఇంటిలో ఉంచుకో కూడదనీ, ఆ పటము ఇంటిలో ఉంటే ఇంటిలో కూడా యుద్ధాలు వస్తాయనీ, అనేక కష్టాలు వచ్చి పాండవులు అరణ్యవాసము పోయినట్లు బాధపడవలసివస్తుందనీ అగ్రకులమువారు నేటికినీ చెప్పుచునే యున్నారు. అటువంటి భగవద్గీత ఫోటోలను గుడులలో ఉంచవలెననీ లేకపోతే ఏటిలోని నదీ ప్రవాహములో పారవేయాలనీ చెప్పడము, చేయించడము కూడా జరిగినది. అంతేకాక భగవద్గీతను ఇంటిలో ఉంచుకోకూడదని భగవద్గీతను ఎవరూ చదువకూడదనీ, చదివితే కష్టాలు వస్తాయనీ, భగవద్గీతను ఎవరి

ఇంటిలోనూ లేకుండునట్లు చేయుచున్నారు. భగవద్గీత అర్జునునికి యుద్ధ రంగములో యుద్ధము చేయుటకు చెప్పినది, అందువలన చదువకూడదు, చదివితే చదివినవారు కూడా అనేక తగాదాలలోనూ, కోర్టు వ్యవహారముల లోనూ చిక్కుకోవలసి వస్తుందని చెప్పడము జరుగుచున్నది. ఇంకనూ హిందువులకు వేదములు ముఖ్యమైనవనీ, వాటిని అన్ని కులముల వారు చదువకూడదనీ, వేదములను తామే చదువవలెననీ చెప్పడము కూడా జరుగుచున్నది. ఈ విధముగా భగవద్గీతకు వ్యతిరేఖముగా మాట్లాడు వారు హిందూ సమాజమునకు చీడపురుగులుకాక ఏమవుతారో మీరే ఆలోచించండి.

ఇదంతయూ గతములో జరిగిన విషయములు, అవి చాలక ప్రస్తుత కాలములో వీరి ఓర్వలేనితనము, మేమే పెద్ద అను గర్వము ఎలాగుందో చూడండి. వేమనయోగిని, పోతులూరి వీరబ్రహ్మముగారిని అగ్రకులము వారు ఎంత హేళన చేసినా, వేమనయోగిని రెడ్డి కులస్థులు వేమారెడ్లుగా గుర్రముల నెక్కి ప్రచారము చేయుట వలన, వీరబ్రహ్మముగారిని విశ్వకర్మ (ఆచారి) కులమువారు కాలజ్ఞానమును ప్రచారము చేయుట వలన, వేమన సంఘములు, విశ్వకర్మ సంఘములు తయారై వేమనను, బ్రహ్మముగారిని ప్రచారము చేయుట వలన, కొంతమంది ప్రజలకు వేమనయోగి పద్యములు, వీరబ్రహ్మము గారి కాలజ్ఞానము కొంతవరకు తెలియును. వేమనయోగి ఆ కాలములోనే తన పద్యములలో అగ్రకులమువారు చేయు తప్పులను ఎండబెట్టడము జరిగినది. వీరబ్రహ్మముగారి చరిత్రలో కూడా బ్రహ్మము గారికి అగ్రకులము వారు చేసిన ఆటంకములను వ్రాయడము జరిగినది.

వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములో **"ప్రబోధాశ్రమము ఉన్నతమైన జ్ఞానము కలది"** అని మూడువందల యాభై సంవత్సరములప్పుడే

వ్రాసియుంచాడు. కాలజ్ఞానములో 'ప్రబోధాశ్రమము' యొక్క పేరుండడము ఈ మధ్యన ఐదు సంవత్సరముల క్రితము మాకు తెలిసినది. తర్వాత బ్రహ్మము గారు వ్రాసిన కాలజ్ఞానములో ప్రబోధాశ్రమమునకు, ప్రబోధానంద యోగీశ్వరులకు సంబంధించిన చాలా విషయములు వ్రాసినట్లు తెలిసినది. ఎంతో గొప్ప జ్ఞాని, కాలజ్ఞాని అయిన పోతులూరి వీరబ్రహ్మముగారు ప్రబోధా శ్రమాధిపతియైన ప్రబోధానందయోగీశ్వరుల వారిని గొప్పగా చెప్పుచూ **"ప్రబోధాశ్రమము వారు శయనాధిపతి గుణములు కల్గియున్నారు. శయనాధిపతియే ఆనందగురువు. ఆనంద గురువే నాకు గురువు, మీకు గురువు"** అని వ్రాయడము జరిగినది. ప్రబోధానందయోగీశ్వరుల జ్ఞానమేమిటో, ఎంత శక్తివంతమైనదో జ్ఞాన జిజ్ఞాసులకు కూడా తెలియు చున్నది. ఎందరో జ్ఞానులయిన వారు యోగీశ్వరులు చెప్పుచున్న జ్ఞానము ఎంతో గొప్పదని ప్రశంసించుచున్నారు. బ్రహ్మముగారే స్వయముగా తన గురువుగా చెప్పుకొన్న వ్యక్తి ఎంతటి వాడయివుంటాడో మనము కూడా ఆలోచించ వలసియున్నది. అయినా ప్రబోధానందయోగీశ్వరుల వారు ఒక్క దైవ జ్ఞానములో తప్ప మిగతా అన్నిటిలో సాధారణ వ్యక్తిగానే కనిపిస్తాడు. ఎదురుగా చూస్తే ఇతనికి జ్ఞానము తెలియునా! అన్నట్లు కనిపించినా, అవును ఆయన ఎవరికీ తెలియని గొప్పవాడే అన్నట్లు ఆయన వ్రాసిన గ్రంథములే గొప్ప శక్తులుగా నిరూపించుకొన్నాయి. ఒక గ్రంథము దగ్గరకు వస్తూనే కొందరిలో మార్పు కనిపించడమూ, కొందరు గ్రంథమును చదివిన వెంటనే అంతవరకు నయముగాని రోగములు పోవడము జరుగు చున్నది.

పైకి కనిపించని శక్తి యోగీశ్వరులలో నిక్షిప్తమైయుండుట బయటికి కనిపించకపోయినా ఆయన చెంతకు పోయినవారికి దేహములో నయము

కాని, మందులులేని ఎయిడ్స్, క్యాన్సర్, డెంగీజ్వరములు సహితము శాంతించి పోవడము జరుగుచుండుట వలన యోగీశ్వరులు ఎంతటివారో ఎవరికయినా సులభముగా అర్థమయిపోగలదు.

వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములో **"ఆనంద యోగిని దూషించిన వారు చాలా ఇబ్బందుల పాలవుతారని"** వ్రాయడము జరిగినది. అలాగే ఆయనను గానీ, ఆయన గ్రంథములనుగానీ దూషించినవారు ఇంతవరకు ఎవరూ సురక్షితముగాలేరు. తెలియని రోగములతో, అర్థముకాని బాధలతో కొందరుండగా, కొందరు చిత్రహింసలపాలై చనిపోవడము జరిగినది. అలా ఎందుకు జరుగుచున్నదో తెలియనివారు, పాపమును మూటగట్టుకొనుటకు యోగీశ్వరుల వారి జ్ఞానమునకు అక్కడక్కడ ఆటంకములను కలుగజేయుచున్నారు. హిందూమతములో ఆదిశంకరాచార్యులు అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించాడు. తర్వాత కొంతకాలమునకు విశిష్టాద్వైత సిద్ధాంతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు. మరికొంత కాలమునకు ద్వైత సిద్ధాంతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. వీరు ముగ్గురూ అగ్రకులము వారు కావడము విశేషము. గత ముప్పైఆరు సంవత్సరముల నుండి **త్రైత సిద్ధాంతమును ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల వారు ప్రకటించి, ఆ సిద్ధాంతమునే ప్రచారము చేయుచూ త్రైత సిద్ధాంతము ప్రకారము భగవద్గీతను వివరించి వ్రాయడము జరిగినది.** హిందూమతములోని సిద్ధాంతముల వివరము తెలియని ప్రజలకు, అగ్రకులమువారు త్రైతము అంటే క్రైస్తవులకు సంబంధించినదనీ, త్రైత సిద్ధాంత భగవద్గీతయని పైకి చెప్పుచూ లోలోపల క్రైస్తవ మతమును బోధించుచున్నారని యోగీశ్వరులకు, యోగీశ్వరుల జ్ఞానమునకు వ్యతిరేఖముగా చెప్పడము జరిగినది. హిందుత్వమును ఒక వైపు సర్వ

నాశనము చేయుచున్న అగ్రకులములవారు హిందూమతమును కాపాడువారి వలె నటించుచూ యోగీశ్వరుల జ్ఞానమునకు కొన్నిచోట్ల ఆటంకము కల్గించడము జరిగినది. మూడుచోట్ల అన్యమతప్రచారమని భగవద్గీతను ప్రచారము చేయు యోగీశ్వరుల శిష్యుల మీద కేసులు పెట్టడడము కూడా జరిగినది. కొన్నిచోట్ల ప్రత్యక్ష దాడులకు దిగడము జరిగినది. అయినా ప్రబోధానంద శిష్యులు అన్నిటికీ ఓర్పు వహించి, జ్ఞానప్రచారము చేయు చున్నారు. ఈ మధ్యకాలములో నల్గొండ జిల్లా భువనగిరిలో దేవేంద్ర అను మా సంఘ సభ్యునిమీద అన్యమత ప్రచారము చేయుచున్నాడని ఆరోపించి కేసు పెట్టడము జరిగినది. అంతేకాకుండా మా ప్రచార వాహనము భువనగిరిలోనికి పోయినప్పుడు మా ఊరిలో ప్రచారము చేయవద్దని అడ్డుపడి పంపించడము జరిగినది. కరీంనగర్‌లో గోడమీద “త్రైత సిద్ధాంత భగవద్గీతను చదవండి” అని వ్రాస్తే, అగ్రకులము వారువచ్చి ఇది క్రైస్తవ మతప్రచారము దానిని తుడిపివేయమని చెప్పడము జరిగినది. రెండు రోజుల క్రిందట ఆర్లగడ్డలో ప్రచార వాహనముండగా అక్కడికి ఒక అగ్ర కులస్థుడు వచ్చి ఇది క్రైస్తవ ప్రచారము, ఈ ప్రచారమును నిలిపివేయండని ఘర్షణపడగా, ఆ సమయానికి మా గ్రంథములు చదివిన వారు అక్కడుండుట వలన వారే అగ్రకులమువారికి బుద్ధి చెప్పి పంపడము జరిగినది. అక్కడున్న ప్రజలు అనిన మాటలు “ఇది ఎంతో గొప్ప జ్ఞానము. ఇంతకాలానికి గొప్ప జ్ఞానము దొరికిందని మేము సంతోషపడుచుంటే, సమాజాన్ని సర్వనాశనము చేసిన మీరు దీనిని జ్ఞానము కాదంటారా? ఇట్లే మాట్లాడితే ఊరిలో లేకుండా మిమ్ములను మేమే పంపుతాము” అని అనడము జరిగినది. ఈ విధముగా ప్రజలే తిరగబడి బుద్ధి చెప్పు సమయము అన్నిచోట్లా వస్తుంది.

గౌతమబుద్ధుడు జ్ఞానము చెప్పితే అతను అగ్రకులము వాడు కాదని, ఆయనది వేరు మతమని ప్రచారము చేశారు. ఆ దినము గౌతముడు హిందువే కదా! తమ ఆధిపత్యము కొరకు హిందూమతమునుండి బుద్ధుని చీల్చి అతనిది బౌద్ధమతమని చెప్పి హిందూమతమునుండి వేరు చేశారు. ఈ దినము బౌద్ధమతము విదేశాలలో వ్యాపించియున్నా స్వదేశములో లేకుండా చేసినది అగ్రకులము వారు కాదా! ఈ దినము బుద్ధుడు మావాడే బౌద్ధము హిందూమతమే అని చెప్పుకోలేని పరిస్థితి మనకు ఏర్పడినది. అలాగే ప్రబోధానంద యోగీశ్వరులు చెప్పు త్రైత సిద్ధాంతమును హిందూ మతములోని భాగము కాదనడమూ, త్రైత సిద్ధాంత భగవద్గీతను భగవద్గీతే కాదనడమును ఒకవైపు ప్రజలు గమనిస్తున్నారు. ప్రబోధానంద యోగీశ్వరులు గత 40 సంవత్సరములుగా బోధించుచున్న బోధ హిందుత్వములోనే ఎంతో గొప్పదని అన్ని మతములవారు ఒప్పుకొనుచుండగా, తగ్గుకులము వారని అగ్రకులముచే అనబడినవారందరూ హిందూ (ఇందూ) జ్ఞానమును తెలుసుకొని చైతన్యవంతులై అగ్రకులము వారికి తిరగబడి జ్ఞానము చెప్పు స్థితికి ఎదిగారు. తగ్గుకులము వారిమీద ఆధారపడి బ్రతుకుచున్న అగ్రకులమువారిని తగ్గుకులము వారందరూ ఒక్కమారు వెలివేస్తే, మీతో మాకు సంబంధము వద్దు అంటే ఏమవుతుందో చెప్పనవసరము లేదు. అటువంటి స్థితి రాకుండుటకు మా జ్ఞానమునకు అడ్డురావద్దని అగ్రకులము వారికి మరీమరీ చెప్పుచున్నాము.

ఇట్లు

**ప్రబోధ సేవాసమితి**



# ప్రాథమిక జ్ఞానము

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు
























































































